# వరవిక్రయము

అను

## సంఘ దురాచారము.

గ్రంథకర్త

నాటకసరస్వతి



పబ్లిషరు

ఊసిరిక బంగారయ్యా,

కాకినాడ.

కోటమర్తి చినరఘుపతిరావుగారిచే

కాకినాడ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

# వరవిక్రయము.



(సాంఘికనాటకము.)

నాటకసరస్వతి విరచితము.




పబ్లిషరు

ఉసిరిక బంగారయ్య,

మెయిన్‌రోడ్డు, కాకినాడ.



మొదటికూర్పు 1000 ప్రతులు.

కాకినాడ.

కోటమర్తి చినరఘుపతిరావుగారిచే

కాకినాడ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1925.




[వెల రు 1-0-0

# ఇందు వచ్చు పాత్రములు.



### పురుషులు.

మాధవరావుగారు — పెండ్లికొమార్తెల తండ్రి.

శరభయ్యగారు — పెండ్లికొమారుని పెంపుడు తండ్రి.

భైరవమూర్తి — పెండ్లికొమారుఁడు.

పెరుగుపేరయ్య } దళారులు.
విస్తరాకులవీరయ్య }

కబుర్ల కామరాజుగారు — న్యాయవాది.

న్యాయాధిపతి

నర్సయ్య — వంట బ్రాహ్మణుఁడు.

గణపతిలాల్ — ఒక మార్వాడి.

సుబ్బిశెట్టి — వర్తకుఁడు.

(ఒక బ్రాహ్మణుఁడు, ఒక సెట్టి, ఒక కమ్మ, వీరు తాత్కాలికముగా వత్తురు.)

### స్త్రీలు.

దుర్గాంబ — పెండ్లికొమార్తెల తల్లి.

సుశీల - మొదటి పెండ్లికొమార్తె } అక్కచెల్లెండ్రు.
చారుమతి - రెండవ పెండ్లికూమార్తె }

సీతమ్మ — శరభయ్యగారి భార్య.

ఎల్లమ్మ — పాలమనిషి.



శ్రీరస్తు.

# వరవిక్రయము.



## నాంది

తే. గీ. మనుజసంతతికి గీలుబొమ్మలుగఁ జేసి
జగమనెడు మహారంగదేశంబునందు
నాటకం బాడఁ జేయు, శ్రీనాథుఁ డెపుడు
సర్వశుభములఁ గూర్చుత సభ్యులకును.

### ప్రస్తావన.

సూత్రధారుఁడు—[ప్రవేశించి] ఆహా! సభ్యులు చక్కఁగఁ గూర్చిరి. రామాయణాది నాటకము లాడు దినము లరిగెను, నేఁడు సభాభవనము మిగుల రమ్యముగ నున్నది (సభ్యులను జూచి) పూజ్యులగు ఓ సభ్యులారా! వరవిక్రయ పిశాచముచే నావహింపఁబడిన మూర్ఖులకు బుద్ధివచ్చునట్లు సీతారామకవిచే రచింపఁబడిన వరవిక్రయనామ దృశ్యకావ్య ప్రదర్శనముఁ జూచుటకు వచ్చిన మీకు నేను వందనము లర్పించుచున్నాను. (చెవియొగ్గి) ఏమనుచున్నారు.

ఉ. కథయా నీతినిఁ దెల్పునట్టి కథయే ? కర్తా సగుణ్యాఢ్యుఁడు, మే
ల్చతురుల్ నర్తకులుక్ సభాజనములా శాస్త్రజ్ఞులౌ బాలికల్
కృతి కర్థ్యాధిపుఁడా తలంపఁగను స త్కీర్తి ప్రతాపాఢ్యుఁ డే
గతిఁ జేకూరెనుగాదె యొక్కయెడ నిం కెన్ సాధ్యమా జేరికన్.

ఆహా! సంతోషము. అట్లయిన నింకఁ గాలహరణము సేయనేల? (ప్రక్కం జూచి) కుంకుమతిలకాంచితభ్రుకుటీ! నటీ! యిటు రమ్ము.

నటి—(ప్రవేశించి) ఆర్యపుత్రా! నేను మీరాకకు నెదురుచూచుచుంటిని తెలిసియా యిట్లు పిలుచుచుంటిరి.

సూత్ర—కాక, మఱేమి?

నటి—కాదు. కాదు. మీరు పొరబడితిరి. నాయాజ్ఞకు మీరుబద్ధులు.

సూత్ర—ఓసి అవిధేయురాలా! అది యెట్లే?

నటి—మాతండ్రి మీకు వేయి రూప్యము లిచ్చి నాకు భర్తగాఁ జేసినాఁడు. ఆకారణమున నేను మిమ్ములను క్రయమునకుఁ దీసికొన్నదాన నైతిని.

సూత్ర—కొంపతీసితివే. (ఇంచుక యాలోచించి) నీవు పలికినమాటయుఁ గొంతవఱకు సత్యమైనదియే. ఎంతవఱకు నీవరశుల్క పిశాచము మన దేశమున నుండునో, యంతవఱకును నీవన్న మాటకుఁ బురుషులు పాత్రులు కావలసిన వారే.

తే. గీ. కడుఁ బవిత్రంబగు భరత ఖండమందుఁ
తుచ్ఛ వరశుల్కదేవత తోఁచి; గృహము
లెల్ల నట్టేటఁ గూల్చుచు నెసఁగుచుండె
దీని వారింపఁగాఁ దగు తెరవు లేదె.

నటి—సంఘసంస్కరణ పరాయణు లందఱును బయలుదేఱి యుపన్యాసము లిచ్చుచుండిరి కదా!

సూత్ర—ఉపన్యాసముల కేమియుఁ దక్కువలేదు. ఇప్పటి సంఘసంస్కరణ పరాయణులందఱును "ఊరువారిబిడ్డ యురుమంత- తన బిడ్డ కదురంత" యనువారే. (ఇంచుక యాలోచించి) ఇప్పు డీమాటలతోఁ గాలయాపనము సేయ నేల. ప్రదర్శనమునకుఁ బాత్రముల సిద్ధము జేసితివా లేదా!

నటి—చేయుటకేమి, ప్రారంభించుటయే యాలస్యము. (ఎదుటఁ జూచి) అదిగో చూడుఁడు. మాధవరావుగారు ప్రవేశించుచున్నారు.

సూత్ర—అట్లయిన రమ్ము. (నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రస్తావన.



శ్రీరస్తు.

# వరవిక్రయము.

## ప్రథమాంకము.

రంగము:—మాధవరావుగారి గృహము.

[మాధవరావు ప్రవేశించుచున్నాడు.]

మాధ—(తనలో)

మ. అమలాంగిం గొనకున్నఁ జింత; మఱి సంతానంబుకై చింత; కూటమి మెండైన భరింపఁ జింత; కను జాడ్యగ్రస్తతం జింత; దుఃఖము గల్గం ఘనచింత; సౌఖ్యములు లేకం జింత; సంసారకూపమునన్ మున్గినవారి కెల్ల నివి సంప్రాప్తించుఁ గాదే కటా.

రామ! రామ! ఆడపిల్లలను గన్నవారి బ్రదుకుఁ జెప్పఁ దరము కాదు. అబ్బబ్బా! ఎంత వెదకినను దగిన సంబంధము దొరకదయ్యెను. సంబంధములకేమి- కావలసినన్ని యున్నవి. నేను బెట్టుకొన్న దీక్ష నిలుచునట్లు కనిపించలేదు. ఎక్కడఁజూచినను బెండ్లికొడుకునకుఁ గట్న మెంత యిచ్చెదరని యడుగువారే. ఆహా! కాలమహిమ. కట్నము లేకుండఁ బెండ్లి చేసితీరవలయునను నాదీక్ష సాగునా? బహిరంగస్థలములలో గొంతుకఁ జించుకొనుచు నుపన్యాసము లిచ్చునప్పుడు- పంతులుగారి యభిప్రాయము చాల మంచిదని యందఱును దలలు ద్రిప్పువారే

కాని- తుదకుఁ గార్యమునచ్చినప్పు డీమాట లన్నియు మఱచిపోయి స్వబుద్ధినో, భార్యల బలవంతముననో, కట్నములవిషయము సెత్తక మానరు. అబ్బబ్బా! ప్రాణము విసిగిపోవుచున్నది. పిల్లలకు సంబంధములు కుదుర్చుటయన్న సామాన్యము కాదు.

మ. ధన మున్నన్ గడువిద్య సున్నయగు విద్యాశ్రీలు రెం డుండినన్
జనురూపం బదియుం బొసంగినను జ్ఞానం బుత్తదా జ్ఞానమున్
ధనమున్ విద్యయు రూపమున్ గలుగుభర్తం గూర్చి, సత్పుత్రి నె
మ్మన మానందముబొందఁ జేయుట ససామాన్యంబె సంసారికిన్.

చాలాప్రొద్దెక్కినది. తిరిగి తిరిగి కాళ్లు నొప్పులెత్తినవి. (నిష్క్ర.)

[సుశీల, చారుమతి, దుర్గాంబ ప్రవేశించుచున్నారు]

సుశీ—అమ్మా! పదకొండుగంట లయినది. నాన్నగా రింకను రాలేదు. ఎండకాలము. ఎక్కడఁ దిరుగుచున్నారో- ఏమిటో!

దుర్గాం—అమ్మాయీ! మీ నాన్నగారు పడుచున్న యవస్థ యింతంతని చెప్ప నలవిగాక యున్నది.

తే. గీ. తగిన సత్కులసూతుల మగల గాఁగ
మీకు నొనరించి ధన్యతఁ బ్రాకటముగ
గాంచనుండిరి మీ తండ్రి గారు తల్లి
యట్టిపని నిమిత్తమె యిప్పు డరిగినారు.

ఈవిషయమై యాయన మిగుల శ్రమపడుచున్నారు.

తే. గీ. పిల్లలకుఁ దగినవరుల వేడ్కమీఱఁ
గూర్చి ముదమార సద్గతుల్ గొనఁగ నెంచు
తండ్రు లిక్కాలమందు నల్లుండ్ర కెట్లు
ధన మొసంగుదుమని చింత మునుఁగుచుండ్రి.

చారు—ఆఁడపిల్లలను గనుటవలన నొక్కతండ్రికే కాదు, అవస్థ తల్లికిఁ గూడఁ గలదు. (అటునిటు చూచుచు) ఇంకను రాలేదే నాన్నగారు.

దుర్గాం—నేనును నదియే చూచుచున్నాను. అనుదినము కాఫీతోఁ బాటు ఏదోకొంచెం ఫలాహారముగూడ నుండెడిది. ఈవాళ తొందరగా వెళ్లవలెనని చెప్పుటచే యొక్క-కాఫీయే కాచి యిచ్చితిని. ఆ కాసినినీళ్లు త్రాగి వెళ్లినారు. పాపము! ఆయనది శ్రమకోర్చు శరీరము కాదు. సంబంధములకొఱకు- అబ్బ- మహాతిరుగుచున్నారు. ఇంతకును కష్టము ఫలియించినచో మనకు సంతోషమే.

సుశీ—(ఎదుటఁ జూచి) అదుగో- నాన్నగారు వచ్చుచున్నారు.

[మాధవరావు ప్రవేశించును.]

మాధ—అబ్బబ్బ! తిరిగినందువలన నేమియుఁ బ్రయోజనము కనఁబడ లేదు.

దుర్గాం—వెళ్ళేటప్పుడు గొడుగైనను వేసికొని వెళ్ళలేదా? అయ్యో! చెప్పులుగూడ లేవే. మఱచిపోయివారా యేమిటి?

మాధ—నాకు మతి యొకటి యున్నదా?

దుర్గాం—అదియేమి?

మాధ—వెఱ్ఱిదానా! ఎందుకని యడుగుచుంటివా?

తే. గీ. కడుపులోని కేశిన మత్కి శంబుకరణి
పాదమునఁ గ్రుచ్చుకొను ముల్లు భంగి, కన్న
బిడ్డల వివాహ కార్యముల్ వేధగలుగఁ
జేయుచుండంగ స్వస్థత చిక్కు-టెట్లు.

దుర్గాం—మీరు వెళ్ళివచ్చిన కార్యమేమయిన సానుకూలమయినదా?

మాధ—సానుకూలమయిన నీ విచార మేల?

దుర్గాం—సంబంధము లెక్క-డను లేవా?

మాధ—లేకేమి! కావలసినన్ని. గవర్నమెంటు ట్రైనింగుకాలేజి, ఆర్ట్సుకాలేజీగూడ దిరగవేసి వచ్చినాను. అందుచేతనే యింత యాలస్య మైనది.

దుర్గాం—సంబంధము లున్నప్పు డీక విచార మేల ?

మాధ—ఉన్నంతిమాత్రమున సరిపోవునా ? పరమపావనమైన గంగా స్రవంతిచే నలంకరింపఁబడిన యీ యార్యావర్తము-దుష్యంతుఁడు మొదలగుచక్రవర్తులచేఁ బరిపాలింపఁబడిన యీ యార్యావర్తము-సత్యధర్మములకు నిలయమైన యీ యార్యావర్తము- అనేక ఋషులచేఁ బరమపావనమైనదని గానముచేయఁబడిన యీ యార్యావర్తము- అక్కటా ! కాలమహిమను వరవిక్రయపిశాచముచే నావహింపఁబడినది.

తే. గీ. ఎంతచదివినవాఁడైన । నెట్టియున్న
తాధికారియైన వివాహ । మన్నమాటఁ
గదిపినంతనె మీరెంత । కట్నమిత్తు
రంచు మానాభిమానంబు । లవలఁ ద్రోచి.

ఎంతపెద్దవానికైనను నొక్కటే పుంపు. సగ్గు లేదు. మా అమ్మాయిని మీ అబ్బాయి కీయవలయునని యున్నదని పలికినంతనే, తిరుపతి వేంకటేశ్వరస్వామి ముడుపువలె మొత్తసొమ్ము కట్నముక్రింద దాఖలు చేయుదు రని సిగ్గువిడిచి యడుగుచున్నారు.

మ. కులగోత్రంబులతోడ నేమిపని మా । కున్ గోరుకొన్నట్టి వి
త్తులభాగ్యంబు నొసంగలేని యదె సం । తోషంబుఁ జేకూర్చు నా
వల మీపిల్లను మా కుమారునకు భ । వ్యప్రీతి సంధిల్లఁ బెం
డిలిఁ గావింతు మటంచుఁ బల్కుదురు త । పస్వీ ! కంటివే చిత్రమున్

కాలవైపరీత్య మిట్లున్నది.

తే. గీ. సంతకున్ దెచ్చు నా పశు । సమితి యట్లు
నడిబజారున వేలము । నఁ గొను వస్తు
వులవిధంబున నల్లుండ్ర । విలువ నిచ్చి
తెచ్చుకొనఁగ వలసివచ్చెఁ । దెలియ లేదె.

తక్కిన విషయములతోఁ బనిలేదు. మగరూపమున నున్నఁ జాలును. రూప మక్కఱలేదు. జ్ఞాన మక్కఱలేదు. కులశీలము లక్కఱలేదు. కొంచెము చదువుకొనుచున్నఁ జాలును. ఆ కొంచెముచదువు నడ్డపెట్టితే డబ్బు—మీపిల్లను జేసికొందుము- మా కేమిధనమిచ్చెదరని యడుగుట ప్రారంభించినారు. ఈ వరవిక్రయపిశాచము ప్రతివారిని నావహించినది.

దుర్గా.—అందఱిని నావహించిన యీ పిశాచమును గూర్చి యిప్పుడు మనము విచారించినందువలనఁ బ్రయోజనము లేదు. ఎట్లు జరుగవలసియున్నదో యట్లు జరుగక తప్పదు. మీ రక్కడక్కడఁ జూచి వచ్చితిరని చెప్పిరే- అక్కడ నెవ్వరైన మన పిల్లలకుఁ దగినవరులు గనిపించిరా ?

మాధ.—కనిపింప కేమి? కావలసినంతమంది. ఎవరిని మాటలాడించినను డబ్బుసంగతి ముందు తెమల్చవలెను. లోవరుసికండరీ అనఁగా తర్డుఫారము ప్యాసు అయినవాని కొకరేటు- ఇదిమాత్రం సామాన్యముగా నున్నదా ! ఈలాటి వెధవలకు అయిదువందలు కావాలి. మెట్రిక్యులేషనువానికి వెయ్యి. యఫ్యేవానికి రెండువేలు. బియ్యేవానికి మూడుఁవేలు. ఇవిగాక పిల్లదానితండ్రి ఆస్తినిబట్టి పొలముంటే- అదికూడా అడగడం. ఈసంగతు లటులుంచుము. ఏవిద్యార్థిని కొంచెము కదిపినను చిత్రముగనే మాటలాడసాగిరి.

సీ. మోటారుసైకిలు కై మొదమారఁ గొనిపెట్టు
మా యని యడిగిన మాన్యుఁ డొకఁడు
యిచ్చుకట్నముగాక మెచ్చినబంగారు
గొలుసు నిమ్మంచును గోరె నొకఁడు
బెస్సైనయింగ్లీషు డ్రెస్సువాచిని గొని
పెట్టుమనుచు విజ్ఞ పీరె నొకఁడు

పట్టపరీక్షకు । పట్టంబునం దగు
వ్రయమెల్ల నిమ్మని । పలికె నొకఁడు
గీ. లాపరీక్షను జనువ నిం । గ్లండు కేఁగఁ
దలఁచితిని గాన దానికిఁ । దగినద్రవ్య
మంతయును మీరు భరియింప । నౌనటంచు
సిగ్గువిడనాడి కోరిన । చెనటి యొకఁడు.

అందఱును నీతీరున నున్నారు. ఎవరి కేమని జవాబు చెప్పఁగలము.

దుర్గాం—కాల మాఱియున్నది. దీనికి మన మేమి చేయఁగలము ఏదో యొకటి నిర్ధారణఁ జేసికొనవలయును. మనము చూడవలసినది పిల్లవాండ్ర సుగుణంబులు- రూపము- సంపత్తి- ఇట్టివన్నియు వారి యందుఁ జక్కఁగ నున్నవా ?

మాధ—ఈకాలపు బిల్లవాండ్ర వేషములు చెప్పనక్కఱలేదు. ఆఁడ పిల్లలఁ గన్నవారియొద్దఁ గట్నముల గ్రహించుటకు మాత్రము వారు కాలేజిలో చదువుచుందురు. ఏమయిన పెద్దలిచ్చిన యాస్తి యున్నసరే, చదువుమాత్రము నమ్ముటకు వీలు లేదు. వారి వేషములు నీవు బాగుగ పరిశీలించినచో నవ్వవచ్చును.

సీ. బంగాళ్రాపింగు । పైఁ బెడసాపిటఁ
దీసి వీధులయందుఁ । దిరుగు నొకఁడు
వారిబోయెడు సతుల్ । తనుఁజూడ వలెనంచుఁ
గూనురాగము దీయు । గూళ యొకఁడు
చేతిలో సిగరెట్టు । చెక్కిట కిల్లిని
బెట్టి "షికార్" గొట్టు । బేల యొకఁడు
చలువజోడును బెట్టి । సైకిలుపై నెక్కి
మురియుచుఁ దిరిగాడి । మూఢుఁ డొకఁడు

గీ. చదువు శూన్యమయినను హ స్తంబునందు
సీటుగా నొక్క యింగ్లీషు బ్యాటుఁ బూని
పదుగురంగూడి పరువెత్తు వాఁ డొకండు
తరుణి! యిట్టులున్నారు విద్యార్థు లిపుడు.

దుర్గాం—ఇట్టి వేషముల వారికి జదు వబ్బునా?

మాధ—చదు వబ్బువిషయము తరువాత నాలోచింపవలసినది. పిల్లవాఁడు చదువుకొనుచున్నాఁడని కట్నములిచ్చి పిల్లల నిచ్చుటకు బయలుదేరుదురుకదా. పెండ్లియైనతరువాత చదువనీ మాననీ. మానటమే ముఖ్యములే.

దుర్గాం—అట్లయిన మనమిప్పుడు చేయవలసిన పనియేమి? ఏదోయొక సంబంధము చూడవలయును గదా! ఇఁక మనము వెనుకటివలె మౌనము దాల్చి యుండుటవలన లాభము లేదు. పెద్దమ్మాయికి ఈడు వచ్చినది. ఇప్పటికే అందఱూ పెళ్ళి యింకను చేయలేదేమని యడుగుచున్నారు. (ఇంచుక యూరకుండి) పోనిండు, మీ రనేక దినములనుండి వరవిక్రయము నిషేధించవలసినదని బహిరంగోపన్యాసము లిచ్చుచుండిరికదా. ఈవిషయ మేమైనను గొంచెము మార్గమునకు రాలేదా? మీతోఁ గలిసియుండు సంఘసంస్కర్తలకుఁ గుమారులు లేరా? అట్టివా రెవ్వరును చదువుకొనుచుండుటలేదా? వారికి మన పిల్లల నిచ్చిన బాగుండదా? లేక వారు మనతో వియ్యమందుట కంగీకరింపరా?

మాధ—ఛీఛీ! సంఘసంస్కర్త లనేకమంది యున్నారు. ఇన్ని దినములనుండియు నే నిచ్చుచున్న యుపన్యాసములన్నియు వ్యర్థములయి పోయినవి. పేరునకుమాత్ర మందఱును సంఘసంస్కర్తలే. సమయము వచ్చినప్పు డొక్కరును ముందంజవేయువారు లేరు. ఇంత యేల? రాధపాటి రంగారావుగారు నాతోఁ బాటు ఉపన్యాసము

లిచ్చుచుండెడివారు. ఆయనకుమారుని పెండ్లివిషయ మే మైనదో నీవు వింటివో లేదో! కట్నముక్రింద మూడువేల రూపాయలు ముందుగనే వసూలుచేసినారు. ఇదేమండి యని నలుగురు అడిగితే అబ్బా! ఏమిచెయ్యమన్నారు. మాయింటి యావిడ మహాపట్టుదల మనిషి. అని ఆనెపము ఆవిడనెత్తిని రుద్దివేసినారు. సంఘసంస్కర్తలందఱును నిదేవిధమున నున్నారు. ఇఁక నొకవిషయము. మాధవరావుగారూ! వరశుల్కమును నెట్లయిన మన మాపవలయునని యెంతయో పట్టుదల వహించియున్న విూజమూరి సుబ్బారావుగారేమి చేసినారు. తనకుమారునకు లక్కరాజువారివద్ద—ఆసుబ్బి వాఁడు విశేషముగాఁ జదువుకొన్నవాఁడు కాఁడుసుమా! లోవర్ సెకండరీ ప్యాసుచేసినాఁడు. ఈమాత్రము చదువుకే వేయిరూపాయలు వసూలుచేసినారు. మన వాళ్ళందఱుకబురులు చెప్పేవారేకాని, కార్యముపట్ల సిగ్గువిడచి ధనము గుంజుచుందురు. అందుచేత కట్నములేకుండఁ బెండ్లిసేయవలయునని యున్న నాయుద్యమము సాగదు. అందులకుఁ బ్రయత్నించినను బ్రయోజనములేదు.

పుర్షో—అట్లయిన నింకఁ గాలహరణ మేల? ఏదోయొక సంబంధము మనము తూగఁగలిగినది నిశ్చయించండి. ప్రస్తుతము పెద్దమ్మాయి పెండ్లియే తలపెట్టుకొందము. కలిసివచ్చినచో రెండును చేయుదము.

మాధ—నేనును నదియే యాలోచించుచున్నాను. ఇట్టివిషయములు మనంతట మన మాలోచించుటకన్న తెలిసినవారి నెవరినైన మధ్యగానుంచుట మంచిది. అందుకని పెఱుగు పేరయ్యగారి నొకసారి భోజనముచేసిన వెంటనే మనయింటికి రమ్మనిచెప్పి వచ్చినాను. వివాహముల విషయములలో ఆయనకు బాగుగఁ దెలియును. ఈయన యొక్కఁడేగాక విస్తరాకుల వీరయ్యగారుకూడ నున్నారు. పేరయ్యగారికిని నాకును మంచిస్నేహము. ఆయనవలన మన కార్యము

సానుకూలమగునని నాకు ధైర్యమున్నది.

దుర్గాం—సరే. ఆయన వచ్చినతరువాత సంగతులన్నియు సవిస్తరముగామాటలాడి సంబంధం కుదర్చండి. ఈనెలలో చేయవచ్చును. (ఇంచుక యూరకుండి) ముందు మీరు స్నానముచేసి భోజనము కానీయండి, వేళమించినది. రండి.

(మాధవరావుగారితో నిష్క్రమించును.)

సుశీ—చెల్లెలా చారుమతీ! నాయనగారును, అమ్మయు మాటలాడిన విధము వింటివా? దీనినిబట్టి నీ వేమి గ్రహించితివి?

చారు—గ్రహించుట కేమున్నది? కట్నమియ్యకున్నచో నాడపిల్లల పెళ్ళి కాదనుమాట నిర్ధారణమగుచున్నది.

సుశీ—చెల్లెలా! ఆడపిల్లలజన్మము తల్లిదండ్రులకు దుఃఖభాజనమే కదా!

తే. గీ. ఆడవారై జననమంది ♦ యలరుకంటె
నడవిలోపల వృక్షంబు ♦ లగుట మేలు
కాకయుండిన వారిని ♦ గన్నవారి
నేడిపించుటకుం గాదె ♦ యిట్టివిధిని.

స్త్రీజన్మ మనేక యనర్థకములకుఁ గారణము.

తే. గీ ధనమొసంగఁగఁ జాలక ♦ తండ్రి గుండు
విడిచియుండఁగఁ జాలక ♦ బేలయగుచుఁ
దల్లి విలపించు, నత్తింటఁ ♦ దాస్యవృత్తి
వచ్చుటం జేసి మదిలోన ♦ వనిత యేడ్చు.

చారు—అక్కా! సృష్టివైచిత్ర్యమునకు మన మేమి సేయుదుము స్త్రీజన్మమంతయు నిట్లేయుండును. అందుకు మనము చేయఁగలిగిన దేమున్నది.

సుశీ—వెఱ్ఱిదానా! చేయఁగలిగిన దేమున్నదని యడుగుచుంటివా?

పేర—నేను వచ్చి యరఘంటయైనది. నేను కాలేజియొద్ద మిమ్ములను కలిసికొని వెళ్ళి యెన్నిపనులు చేసినాననుకొన్నారు. విస్సంసెట్టి కోటిలింగంగారింటికి వెళ్ళితే నాలుగు దోసకాయలు కొంచెంతోట కూర యిస్తే అది పుచ్చుకొని వస్తూ వస్తూ బాదంవారింటివద్ద వెనుక యెప్పుడో ఆబ్దికము పెట్టించినప్పుడు యియ్యవలసిన దక్షిణ వసూలుచేసికొని తిన్నగా యింటికివచ్చి దేవతార్చన చేసుకొని భోజనం చేసికొని యిట్లు వచ్చినాను.

మాధ—పాపము నామూలమున భోజనం చేసినతరువాత విశ్రమించ కుండానే వచ్చినారు.

పేర—ఏదైనా వ్యాపారంవస్తే విశ్రమిస్తే యేలా అవుతుంది. అందులో తమయాజ్ఞ నాకు సుగ్రీవాజ్ఞ. భోజనంచేసిన తరువాత పొడుమయినా చేసికోకుండా వచ్చినాను. వస్తూ వస్తూ నరసయ్య కొట్టుదగ్గఱ కానీపొడుము వేయించుకొన్నాను. (పొడుముపీల్చి) ఛీ! వెధవ తవుడుమోస్తరు, చెన్నపట్టణం పొడుమన్న పేరేగాని నేను స్వయం గాచేసికొంటే కమ్మని కందిపొడివలె నుండాలి.

మాధ—అమ్మాయీ! మీఅమ్మభోజనమయినట్లున్నది. ఒక్కసారి యిక్కడికి రమ్మనమని చెప్పండి.

(సుశీల చారుమతి నిష్క్రమింతురు.)

మాధ—శాస్త్రులుగారికి నామీద దయయే.

పేర—ఎంతమాట చెప్పినారు. తమబోటివారి నాశ్రయించుకొనియే యేమిటో యిట్లు కాలము వెళ్ళతీస్తున్నాను. ఈగ్రామంలో ఎవ రింట్లో వివాహములువచ్చినా సాధ్యమైనంతవఱకు నా ఆలోచనలే కుండా చెయ్యరని నేను గట్టిగా చెప్పగలను.

మాధ—సరిసరి. నాకుదెలియదా! అందుకనే పిల్లల వివాహవిష యము తమతో ముచ్చటించవలెనని రమ్మనమని కోరినాను.

[దుర్గాంబ ప్రవేశించును.]

మాధ—ఓసీ! వీరే నేచెప్పిన శాస్త్రులుగారు. ఈగ్రామంలోనే కాదు జిల్లా మొత్తంమీద వీరికి తెలియని సంబంధములు లేవు.

దుర్గా—ఇంతకును మన అమ్మాయిలకుఁ దగిన సంబాధము లెక్కడ నైన నున్నవా?

పేర—అమ్మా! లేకేమి! ప్రతివ్యాపారము డబ్బుతోవున్నది. అది వుంటే కొండమీదకోతి అయినా దిగివస్తుంది. ఒకసంబాధంకాదు. వేయిసంబంధములున్నవి. సింగరాజువారు, కందుకూరివారు, ముంజులూరివారు, నరహరివారు, సోమరాజువారు, కలికొట్లవారు, ములుకొట్లవారు ఒకటేఁవిటి

మాధ—పేరయ్యశాస్త్రులుగారూ! నావిషయం మీకు యింతకుపూర్వము బాగా తెలిసేయుండవచ్చును. అయినను కొంచెము చెప్పవలసియున్నది. నేను సంఘసంస్కరణపరాయణుఁడను. ఇప్పటికి అయిదారు సంవత్సరములనుండి వరులకు గట్నమునోసంగి వివాహములు సేయరాదని ఏకదీక్షగా నుపన్యాసము లిచ్చుచు నట్టివిధముననే నాకుమార్తెలకు వివాహములు సేయవలయునను నభిప్రాయములో నున్నవాడను. నాసంగతిగూడ మీరు బాగుగ యోచించి మా అమ్మాయిలకుఁ జక్కని సంబంధములు చూడవలయునని నాకోరిక.

పేర—మాధవరావుగారూ! మీయభిప్రాయము మంచిదే. మీయుద్యమముగూడ మంచిదే. కాని దానివలన నేమీ ప్రయోజనముండునని నాకుదోచదు. ఒక్కసంగతి అడుగుతాను. మీరుకోపపడక జవాబు చెప్పండి. బాబూ! మీ రిన్ని సంవత్సరాలనుంచి ఈవిషయంలో శ్రమపడుతున్నారుకదా! ఏమైన లాభించిందా! కట్నం లేకుండా ఒక్కవివాహమైన జరిగినదా! జరిగినసంగతైనా విన్నారా!

ఎందుకంటే ! ఈప్రయత్నములు వట్టికబురులు చెప్పేవారే కాని క్రియదగ్గిఱ మాత్రం ఊహలు తెలిసిందాఅండి. నేనన్నానని మీరు ఆగ్రహించవద్దు. మీయుద్దేశం లాభంలేదు. ఆ యాశ వదలి వేయండి. అది మనస్సులో పెట్టుకోకండి. కొనసాగని కోరికవలన లాభంలేదు. ఇక నాపక్షం వదలిపెట్టి మామూలుపక్షానికి రండి.

మాధ—పేరయ్యశాస్త్రులుగారూ ! ఈవిషయంలో నేను గట్టిదీక్ష బూనియున్నాను. మీరుగట్టిగా ప్రయత్నంచేస్తే నాకోరిక సమకూరుతుందేమో యని యభిలాష.

పే—లాభంలేదు. లాభంలేదు. అదివట్టిమాట. మీరు ఈసంగతి విన్నే యుంటారు. పల్లపల్లిలో ముట్నూరి నరసయ్యగారు యిదేవిధంగా పట్టుపట్టి కూర్చున్నారు. ఆయనప్రతిజ్ఞ సాగలేదు సరికదా, వివాహముకాకుండానే పిల్ల పెద్దమనిషిఅయి కూర్చున్నది. ఎల్లాగో నానా అవస్థలుపడి నలుగురువింటే నగుబాట్లని గభుక్కున ఒక చవట వెధవకు గట్నము దప్పినది కాదు. మొత్తముమీద వాడికిచ్చి కట్ట బెట్టినారు. ఏలాగో కార్యం అయిపోయిం దనుకొంటె అది అనుకూల దాంపత్యముకా లేదు. వివాహమైనవెంటనె పిల్ల కొంపవదలి లోకల్ ఫండుబంగాళాప్రక్కవేతే కాపురం సాగించింది. ఈసంగతి అల్లావుంచండి. పెండేలవారి అమ్మాయిని యీలావుంచితే పెద్దమనిషి అయినే అందఱుకలిసి ఆంక్ష అన్నారు. అప్పు డేమిచేస్తారు- ఆవిడంతట ఆవిడే రాజమండ్రీ వెళ్ళి- ఏదో బేవారసపు సంబంధం చేసుకొంది. ఈలాటి సంగతులన్నీ తమయొద్ద చెప్పకూడదు. ఈకాలంలో కట్నంలేకుండా పెళ్ళిచేస్తామన్నమాట కల్ల. కల్ల.

తే. గీ. బేరుల గృహంబునందు జ నించి మించి
కమ్మవా రింటిలోపల నె గౌరవముగ

బెరిగి, బ్రాహ్మణులను జేరి కై వివిధకళల
నెగడుచున్నది వరశుల్క కై నీరజాక్షి.

ఎంత ప్రయత్నం చేసినా యిది మనలను విడిచిపోదు.

మార్గా—(భర్తను జూచి) శాస్త్రులుగారు చెప్పినమాట సత్యము. ఇక యితరాలోచన పెట్టికొనక మంచిసంబంధం చూడండి. శాస్త్రులుగారూ! ఈవిషయంలో మీరే శ్రమవహించవలయును. కట్నముల మాట కేమిలెండు. ఇయ్యవలసి వచ్చినప్పుడు తప్పదు. అయినా మీరు మాయందు దయయుంచి మాస్థితిగతులు గూడ విచారించ కోరుతాను.

పేరి——సరిసరి. ఎంతమాట చెప్పినారు. నేను పరాయివాడిని కాను. నాసంగతి పంతులుగారికి తెలుసును. మీసొమ్ము వృధగా ఒకదమ్మిడ పోనిస్తానా! ఒక్క సంగతి మాత్రమున్నది. సంబాధములు చూడడంలో అనేక మొత్తములున్నవి ధనము, రూపము, విద్య, గుణము; ఈనాలుగూ ఒక చోట అమరుట చాలా కష్టంగదా. అందు కని మీరు వీటిలో ఏవి ప్రధానంగా చూడగోరు సంబంధం కుదుర్చుమంటారు. సాధారణంగా లోభియొద్ద ధనమెక్కువగా వుంటుంది. ముష్టెత్తుకొని- మ్యునిసిపల్ లాంతర్ల వెల్తురున రాత్రిళ్ళు చదువుకొను నీళ్ళకావిళ్ళు మోసేవారి కొడుకులను నెక్కువగా సరస్వతి ఆశ్రయిస్తూవుంటుంది. ఇవన్ని వున్నచోట గుణముండదు. ఇందులో మీకేది నచ్చుతుంది. అయినప్పటికీ కొన్ని సంబంధాలు మీకు చెప్పుతాను వినండి. మంచిరాజు మంగయ్యగారి అబ్బాయి మెట్రిక్లేషను చదువుచున్నాడు. 17 సంవత్సరముల వయస్సు. వసతి కేమీ లోపం లేదు. వెయ్యిరూపాయలు సంవత్సరమునకు పొలంమీద వారికి వస్తాయి.

సి.గ్రా——చిన్నదమ్ములు ఎంతమంది.

పేర—మంగయ్యగారికి కుమాళ్ళు ఆరుగురు. కుమార్తెలు నలుగురు.

దుర్గాం—ఆరుగురు కుమాళ్ళే, ఆస్తి కంచుకొంకే చెప్పనక్కరలేదు. వద్దుబాబూ.

పేర—మంగిపూడి పేరయ్యగారి సంబంధం. కుర్రవాడు చాలా అందమైనవాడు. రోజూ మీరు చూస్తూనే వుండవచ్చును. బైసికిల్ బండీ యెక్కి ఈదారినే వెళ్ళుతూ వుంటాడు. ఈసంవత్సరం పరీక్ష గూడా ప్యాసు అయినాడు. అయితే పేరయ్యగారు కుర్రవాడిని బి. యల్. పరీక్షవరకు చదివిద్దామని వున్నదనిన్నీ - అంతచదువు వరకూ భరించదగినవారికి కుమారుని నియ్యదలచి వున్నట్లున్నూ విన్నాను.

దుర్గాం—తక్కిన సంగతులు ఏలావున్నా ఆ అబ్బాయికి కొంచెము కాలు అవుడు.

పేర—కొంచెం కాలు అవుడన్నమాట వాస్తవమే కాని, ఆ అబ్బాయికోసర మెంతమంది కనిపెట్టుకొని వున్నారు. లక్షోపలక్షలు. అతని వివాహవిషయంలో వేలంపాటలు గూడ సాగనవి. పోనియండి. ఆసంగతి మనకెందుకు లెండి. మఱొకటి చూద్దాము.

మాధ—శాస్త్రులుగారూ ! వీరంతా కట్నముల విషయంలో ఆకాశ మెక్కి కూర్చున్నవారే !

పేర—వీరిసంగతే ఇల్లాగ అంటున్నారు. బుద్ధి రాజువారు మొదలయిన వారంతా తమ కుమాళ్ళకు యింతకు తక్కువ కట్నంయిస్తే వప్పుకొననుని గేట్లు సిద్ధాంతం చేసికొని, ఎవరు మళ్ళీ ప్రశ్న వేయకుండా బోర్డులమీద వ్రాసి వీధివాకిట గట్టినారు.

మాధ—శాస్త్రులుగారూ ! ఈ ఒక్కకట్నములతో సరిపోతుందా. అత్తవారిని అల్లుళ్ళు పెట్టే త్రిప్పలు చెప్ప నలవికాదు.

సీ. అనఁ గొన్న దంతయు నప్పుడిచ్చినఁగాని
సూత్రంబు గట్టక చూచుచుండు
అలకపానుపు నెక్కి యదితెమ్ము యిదితెమ్ము
యని దాచబెట్టిన యట్టు లడుగు
శోభనం బన్నంత నే భయం బొదవఁగా
లంచంబు నెంతో నిమ్మంచు నడుగు
పిలువకున్నను గాని వేడ్కతోఁ బాయుగ
వచ్చినయంతన వచ్చి చేరు

గీ. ఎంతచేసినఁ జివరకు స్వాంతమందు
దృష్టిఁ బొందకయుండి మ తెప్పుడైనఁ
బిల్ల నంపుమనుచుఁ గోర బిఱ్ఱబిగియు
నల్లురకు దనియింప శక్యంబె వసుధ.

దుర్గాం—ఆవిచారణ అంతా యిప్పుడెందుకు లెండి. పేరయ్య శాస్త్రులుగారూ! ఏదోఒక సంబంధం మంచిది నిర్ధారణ చెయ్యండి. ఈసంవత్సరమునకు పెద్దమ్మాయి పెళ్ళిచేస్తాము. తరువాత రెండవదాని సంగతి చూచుకొందాము. తొందర యిదే.

పేర—బుద్ధిరాజువారి చిన్నవాడు బాగుంటాడా! అన్నివిషయముల లోను అతడు మీామచ్చుకు ఆగుతాడని తోస్తుంది.

దుర్గాం—మా అమ్మాయికిన్నీ అతనికిన్నీ వయస్సులో అట్టే తేడా లేదు. అందుకని భయం.

మాధ—నీవేదో ఒకఅడ్డు చెప్పుతునే వుంటావు. నీ యభిప్రాయమును అనుసరించి సంబంధం వెదకడం కష్టమే.

పేర—బాబూ! మీారిల్లా అనకూడదు. ఆడవాళ్ళుకదా- ఒకపట్టున వారి కేసంబంధమైనా నచ్చదు. తనకు మంచిఅల్లుడు రావలయునని ప్రతి ఆడదానికి నుండును. (దుర్గాంబను జూచి) అమ్మా! ఈసం

బంధములన్నియు నటుంచుడు. చెప్పినకొలదీ చాలా బయలుదేరు తవి. మీరు వయస్సు, పొట్టి, పొడుగు సంగతి వదలివేసెయ్యండి. నాకంటె మాఆవిడ అయిదునెలలు పెద్ద. ఇదిగాక మంచి సంబంధములు కలిసివచ్చినప్పు డటువంటి అసందర్భము వస్తే జాతకం ఫిరాయించడం యిప్పటి జ్యోతిష్కులకు మామూలేకదా ! ఈ లాటి విషయములు వస్తే నేను వున్నానుగా! కాబట్టి ఒక్క మంచి సంబంధం చెప్పుచున్నాను వినండి. మాచిరాజు శరభయ్యగారి కుమారుడిని మీరెప్పుడయినా చూచినారా !

మాధ—శరభయ్యగారి పుత్రుఁడేనా బైసికిల్ మీదయెక్కి తిరుగు తుంటాడు.

పేర—శరభయ్యగారి దత్తపుత్రుడు లెండి; స్కూల్‌ఫైనల్ ప్యాసు అయినాడు. చక్కనివాడు; బుద్ధిమంతుడు; నాకునచ్చిన సంబంధం; ధనమునకా లోపంలేదు; పిల్ల సౌఖ్యపడుతుంది. ఇంట్లో అట్టే బాదరబందీలేదు; శరభయ్యగారి భార్య సీతమ్మగారు కూడా చాలా మంచివారు.

దుర్గాం—శరభయ్యగారికి సీతమ్మగారు మూడవసంబంధపు భార్య కాదూ !

పేర—అదంతా మనకెందుకు లెండి; ఏమండి మాధవరావుగారూ ! ఈ సంబంధం విషయంలో మీ రేమంటారు.

మాధ—ఊరికే అలోచిస్తే లాభంలేదు. ఈసంబంధం కుదర్చండి.

పేర—సరే. కాని శరభయ్యగారు డబ్బువిషయంలో మహానిక్కచ్చి మనిషి; ఏమీ మొగమోట ముంచడు. కట్నము విషయంలో ఏమంటారో! రెండువేలు మూడువేలు కట్న మిస్తామని యింటి చుట్టూ అనేకమంది తిరిగిపోతున్నారు. సంబంధం మాత్రం వజ్రపు

తునక అని గట్టిగా చెప్పగలను. కట్నము విషయమై మీ అభి ప్రాయం చెప్పండి.

దుర్గాం—శాస్త్రులుగారూ ! మంచిసంబంధ మైనప్పుడు కట్నముకోస ము వెనుకకు తీస్తామా ! సమయము వచ్చినప్పుడేకదా ఖర్చవుట.

పేర—ఆ ! పరవాలేదు. ఆమాత్రం మాటయిచ్చారంటే చాలు; అన్నట్లు మీ అమ్మాయిలకు తాతగారు ఏదో కొంచెం వ్రాసి యిచ్చినట్లున్నారే.

మాధ—లేకేమి ఇద్దరు మనుమరాండ్రకు చెరిఅయిదువందల రూపా యలు సంవత్సరమునకు వచ్చేపొలం వ్రాసియిచ్చినారు. ఇప్పుడు పిల్లలవంటిమీద వెయ్యేసిరూపాయల నగలువున్నవి. వీటితోడనే మేము కన్యాదానము చేస్తాము.

పేర—అయితే పరవాలేదు. శరభయ్యగారిని ఆట్టే పైమెట్టు ఎక్క నియ్యకుండానే చూస్తాను.

మాధ—నా కదియంతా యేమీ తెలియదు. ప్రతివిషయము మీ యందున్నది. మీ శ్రమ వృథపోదు. ఈమాట మఱచిపోవద్దు.

పేర—అన్నన్నా! ఎంతమాటన్నారు. మీహృదయం నాకు తెలియదా.

మాధ—మరల మిమ్ములను నే నెప్పుడు కలిసికోగలను.

పేర—ఎప్పుడో నా! రేపుదయం పంచాంగం చూచి వర్జములేకుండా, శరభయ్యగారి దగ్గఱకు వెళ్ళి ఈసంగతి ముచ్చటించి మీదగ్గఱకు వస్తాను. ఏలాగో కార్యం సానుకూలం చేసే బాధ్యత నాది.

మాధ—మంచిది దయయుంచండి.

(అందఱును నిష్క్రమింతురు.)

ఇతి ప్రథమాంకము.





శ్రీరస్తు.

# వరవిక్రయము.

## ద్వితీయాంకము.

రంగము:—కచేరి చావడి.

[ప్రవేశము—శరభయ్యగారు.]

శర—అబ్బా! ఏవిషయంలో గొంచెము అశ్రద్ధగానున్నను ఏమినష్టము వస్తుందో యని భయమే. తెల్లవారి లేచిన తరువాత, దాసీది గోడకు పిడకలు చరిచేటప్పుడు దగ్గిఱ వుండి లెక్క పెట్టకపోతే అది యెక్కడ తస్కరిస్తుందో అని భయం. పాలు పిదికేటప్పుడు దగ్గిఱ వుండాలి. ఇట్టి చిల్లరపనులన్నీ చూచుకొనేటప్పటికి యింతసేపయింది. ఇక కచ్చేరి కాగితాల వ్యాపారం చూచుకోవాలి. అన్నిటికంటె ఈవిషయం ముఖ్యమైనది. నోట్లేమయినా కాలదోషం పట్టితే కొంపలంటుకొంటాయి. తాకట్టు దస్తావేజులతాలూకు వడ్డీలు యిచ్చేరోజులు చూచుకోవాలి; తక్కిన విషయములేలా వున్నా డబ్బు విషయంలో మాత్రం అశ్రద్ధవుండకూడదు; దమ్మిడీపోతే ప్రాణం పోయినట్లుంటుంది. 'ధనమూల మిదంజగత్' అన్నారు. అది లేకపోతే మనిషిమారడు; నిర్ధన పురుషుణ్ణిచూస్తే గడ్డిపోచకంటె నీచముగా చూస్తారు; ప్రతిదానికి ధనము వుండవలెను.

సీ. కులహీనుఁడైన ని ర్మలయశమందగా
వలెనన్న ధనముండ వలయుఁ గాదె
సర్కారుబిరుదులు సంతసంబున నంద
వలెనన్న ధనముండ వలయుఁగాదె
గౌరవోద్యోగంబు గాంక్షించి చేయఁగా
వలెనన్న ధనముండ వలయుఁ గాదె
అప్పిచ్చిపెరవారి యాస్తిని లాగఁగా
వలెనన్న ధనముండ వలయుఁగాదె
గీ. అట్టి ధనముయొక్క విలువ నరయలేక
వ్యర్థముగ నోడల్ తెలియక పాడుసేయు
వారిమోములు జూచినఁ బాప మొదవు
గాన ధనముతోడనె యోజ గంబు నిలచు.
సీ. కూటసాక్ష్యము లిచ్చి కొంపలు దిగమ్రింగి
ద్రవ్యంబు నార్జించి దనరవలయు
ఫోర్జరీ పత్రముల్ పొందుగా లిఖియించి
ద్రవ్యంబు నార్జించి దనరవలయు
దారుల నరికట్టి ద్రవ్యవంతులఁ గూల్చి
ద్రవ్యంబు నార్జించి దనరవలయు
అడిగిన యప్పిచ్చి యాస్తులెల్లను లాగి
ద్రవ్యంబు నార్జించి దనరవలయు
గీ. పరులయొద్దను దెచ్చు ద్ర వ్యంబు మాత్ర
మొంతగా యడిగినఁ గాని యీయకుండ
ధనము నెంతయు నార్జించి దనరవలయు
ధనము లేకున్న బ్రతుకు వ్యర్థంబు గాదె.

డబ్బు సంపాదించడమంటే మాటలతో లేదు. దీనికి చాలా తెలివి

వుండవలెను. కొంచెము ధనముతో గుప్పలుగా గూర్చుకొనవలెను. కాస్త డబ్బున్నదంటే పన్ను ఎక్కువవుతుంది. దానికి దొంగలెక్కలు వ్రాసి యధికార్లకు జూపించి మాయచేయవలయును. కొంపొందు ఇన్టరెస్టుకు అప్పియ్యవలెను. ఇచ్చిన అప్పుకు నాలుగురెట్లు ఎక్కువ అయిన ఆస్తి తణఖా వ్రాయించుకొనవలయును. పరుల సొమ్ము పాయసమువలె చూచుకోవలెను. ధనము సంపాదించే నిమిత్తము ఎట్టి నీచమయిన పనియైనను చేయవచ్చును. తుదకు గన్నములు గూడ వేయించవచ్చును. ఈతీరుగా సంపాదించిన ధనము పోకుండ జాగ్రత్తగ గాపాడుకొనవలయును. దీనిని గాపాడుకొనుటకు నౌఖర్లను చాకర్లను పెట్టితే జీతం దండగ. అందుకని రామభజన అని వంకబెట్టి రాత్రి 11 ఘంటలకు ప్రారంభించి మూడు ఘంటలయ్యేవఱకు చేత తాళం పుచ్చుకొని రాం రాం అంటూ కూర్చుంటే సరిపోతుంది. ఇరుగుపొరుగువారు రాంభజన చేసుకొంటూ వున్నాడనుకొంటారు. బాగా డబ్బు సంపాదించి మూటకట్టిన వాని హృదయము మిగుల కఠినమైనదిగా నుండవలయును. ఇంట్లో యితర మనుష్యుల కెవరికి మఱియొక విస్తరి వేయకూడదు. ఎవరైనా చుట్టములు చూడడానికి వస్తే భోజనంచేసి వచ్చినారా యని యడుగవలయును. బిచ్చగాండ్రెవ్వరైన గుమ్మముముందు నిల్చి కేకలు వేస్తే తిరిగి గుమ్మము ముఖము యెప్పుడూ చూడకుండా నడ్డి విఱుగునట్లు తన్నవలయును. దానములని ధర్మములని యెవరైన జేరినట్లయితే నెమ్మదిగా వారితో ధర్మపన్నములు చెప్పి యిచ్చువానివలె నటించి, కష్టపడి సంపాదించవలెను గాని యాచనవలన లాభములేదని చెప్పి పంపవలయును. ఇట్లు చేసినచో ధన మెందుకు దక్కదు. ఏమైనను ధనము సంపాదించుటకు వడ్డీని మించిన సాధనము లేదు.

తే. గీ. కాయకన్నఁ గడురుచి వంకాయతొడిమ
భార్యకన్నను నుంపుడుకత్తె ప్రియము.

దానికంటె మిగుల ముద్దు ॥ దానికొడుకు
నసలుకన్నను వడ్డియే ॥ యధిక ప్రియము.

ఈధనముయొక్క విలువ తెలియక పెద్దపెద్దవారు బైసికిల్సుకని, మోటార్లకని, రిఫ్రెష్‌మెంటు రూములకని, త్రిక్యాసిల్సు, సిజర్సు సిగరెట్లకని, వైన్ విస్కీలకని, నానామోస్తరులుగా పాడుచేయుదురు కొందఱు గౌరవంకోసం స్కూలుపిల్లలకు జీతములిచ్చి, భోజనములు పెట్టి ఎవరైన పెళ్ళి వోడుగు చేసుకొంటామంటే ధర్మమిచ్చి దేవుళ్ళకని దెయ్యములకని పాడుచేస్తారు. ఉన్నకాస్తధనం పోయినతరువాత వీళ్ళ గౌరవంయేమిటికి ? అప్పుడు వీళ్ళమొగాలు ఎవరుచూస్తారు. ధనమును మించినదైవమెవరు ? ధనముమూటను ఎదురుగా బెట్టుకొని నిత్యము పూజించుచుండుటయే మోక్షము; అదియేపుణ్యము; సకలపుణ్యక్షేత్రములు చూచినఫలము; గంగా గోదావరీనదులలో స్నానము జేసిన ఫలము వచ్చును.

[నరసయ్య ప్రవేశము.]

నర — ఏమండి పంతులుగారూ ! ఇంకా కూర్చున్నారు. సామాను కొట్టు గదితలుపుదీసి వంటసామగ్రి యియ్యరా యేమిటి. ప్రొద్దెక్కిపోవడంలేదా !

శర — ఈవాళ యెవరూ భోజనమునకు పిలిచినట్లులేదే.

నర — లేదు.

శర — పిలుస్తారేమో అని యింతసేపు కూర్చున్నాను.

నర — ఒకవేళ యెవరైనా పిలిచినా మీరేగాని అమ్మగారు వెళ్ళరుగా!

శర — చెప్పితే వినిపింటుందా ! పిల్లవాడూ అంతే. ఎవరైనా భోజనానికి పిలిస్తే వెళ్ళితే పరువుతక్కువ అనుకొంటారు.

నర — సరే. వంట సామాను యిప్పించండి.

శర — ఏంకావాలి.

నర—ఏంకావాలంటే అన్నీ కావలసినవే. మీకు తెలియని దేమున్నది.

శర—సరే. చీటి వ్రాసికొని ఆప్రకారం యిస్తాను. ఈపూటకు కావలసినది విను. బియ్యం పావుతక్కువ శేరు.

నర—పావుతక్కువ శేరు ఏలాసరిపోతాయి ; నలుగురము వున్నాము. వాళ్లు పావుశేర్లన్నా వుండవద్దా. అదిగాక అంట్లలో అన్నము పడడం లేదని "అసిరి" గొణుగుతూవుంది.

శర—బాగు బాగు. అసిరికి అంట్లల్లో అన్నము వేస్తామని యొడంబడిక యెప్పుడూ లేదు. వాళ్లు పావుశేర్లు అక్కరలేదు. ఇంటి ఆవిడకు అజీర్తి చేసిందంట. అట్టే అన్నము తినదు; కుర్రవాడి తిండినీకు తెలిసిందే; సరే విను. చింతపండు రెండు తులములు, ఉప్పు రెండు తులములు, మిరపకాయలు 18, పెసరపప్పు చటాకు, వంటకట్టెలు 4, రెండు తులములు నెయ్యి- అన్నట్టు మఱచిపోయినాను రాత్రి కాలగామిగిలిన కట్టెలు ఏమీ లేవూ !

నర—లేవు.

శర—కొంచెం జాగ్రత్తగా వాడు. సరుగుడు కఱ్ఱ చాలా ప్రియంగా వుంది. ఇకనుంచి మడకట్టె తెప్పిస్తానులే. పప్పు బొగ్గులపొయ్యి మీద వేసెయ్యి. దొడ్లో వున్న చెట్లక్రింద ఏమయినా కొంచెం ఎండుపుల్లలు వుంటాయి చూడు, వీటి జతచేయవచ్చును. సంసారం చెయ్యడమంటే ఏమనుకున్నావు.

నర—పుల్లలుగూడ నే నెక్కడ ఏరి తేగలను.

శర—నీ సంసారమైతే నీవు ఏరుకోవా ?

నర—బాగానేవుంది. ఇంతకూ కూరమాట ఏమిచెప్పుతారు.

శర—ఇంకా కూర కూడా కావలెనా ? కొంచెం ఆవకాయి తీస్తే తీరిపోదూ. పచ్చిపులుసు కాస్త చెయ్యి. మిరపకాయలు కాల్చినలుపు.

పులుసంటే మళ్ళీ ఏవంకాయలకో బజారుపంపాలి. పద నేనువచ్చి సామాను యిస్తాను.

నర—బాబూ! మీయిండ్లలో వంట చేయడంకన్న ఎక్కడనైనా నాలుగునీళ్ళకావిళ్ళ మోసి బ్రతకడం సౌఖ్యం. మీ తిండి నేను తినలేను బాబూ! (నిష్క్రమించును.)

శర—(తనలో) వీడికి తల పొగరెక్కింది. ఈముండాకొడుకుకి యీలాటితిండి సరిపడదట. ఏలాగో పిల్లవాడి పెళ్ళి అయ్యేదాకా కాలక్షేపం చేస్తే తరువాత వీడికి స్వస్తిచెప్పవచ్చును. వంట తప్పేలా కోడల కియ్యవచ్చును.

భైరవమూర్తి—(ప్రవేశించి) నాన్నా! బజారు వెళ్ళుచున్నాను. కూరల కేమయినా ఒక రూపాయి యిచ్చెదవా?

శర—కూరలకు రూపాయా! కొంప నట్టేట కలుపదలచుకొన్నావా యేమిటి? రూపాయి పెట్టి ఏమి కూరలు తెస్తావు.

భైర—రూపాయి అంటే ఎంత; ఒకవీసెడు బంగాళాదుంపలు, వీసెడు కాకరకాయలు వస్తాయి.

శర—బాగున్నది. ఈలాగయితే నీవు కాపురం బాగాచేస్తావు. బంగాళదుంపలు వాతం, కాకరకాయలు మంచివి రావడంలేదు. రేపు నేను బజారువెళ్ళినప్పుడు తెస్తానులే.

భైర—పోనిలే. నేను కలం లేక నానాఅవస్థ పడుతున్నాను. శ్వాను ఫవుంటెన్ పెన్ కొనుక్కోవాలి పదిరూపాయిలియ్యి.

శర—చాలుచాలు. ప్రస్తుతం నాదగ్గిరకలముందిలే. నీరాతకు ఈకానికలం చాలును. ఫవుంటెన్ పెన్లు అవన్నీ రేపు అలకపాన్పుక్కి అత్తవారిని అడిగిపుచ్చుకొంకుగాని, అదిఒక్కటేకాదు. అత్తవారిని అడిగేది బైసికిల్ బాడి యింకా నీకుఁ గావలసినవన్నీ.

భైర—నీవు ఎప్పుడేది అడిగినా యిట్లేదాటేస్తున్నావు.(నిష్క్రమించును)

[తెరలో బాబూ! శరభయ్యగారూ!]

శర—ఎవరువారు.

[తెరలో] నేను సుబ్బిసెట్టిని.

శర—(తనలో) వీడితల్లి బొడ్డుపొక్క ఇప్పుడొచ్చాడే. ఏవో నాలుగు మాటలుచెప్పి డబ్బియ్యకుండా పంపవలెను. (ప్రకాశముగా) సుబ్బిసెట్టియా! రా సందేహిస్తావెందుకు.

సుబ్బి—(ప్రవేశించి) గొప్పవారింటిలో ధడాలున ప్రవేశింపరాదు అని మాపెద్దలు చెప్పారు.

శర—పాపం నీకు లెఖ పంపడం చాలా ఆలస్యమైనది.

సుబ్బి—అందుకనే దర్శనం చెయ్యడానికి వచ్చినాను. తమవంటి లఘౌధికార్లే యీలాచేస్తే మేమేమి వ్యాపారంచేస్తాము. ఈవాళ దయ చేయించాలి తప్పదు.

శర—నేను చాలాతొందరపనిమీద వున్నాను. ఈవాళ కోర్టులో ప్లయంటుచేయవలసిన నోట్లు కొన్నివున్నవి. నేను అబ్బాయిచేత రేపుదయం తప్పక పంపుతాను. వెళ్ళు.

సుబ్బి—పెద్దమనుష్యులు అల్లాగంటే ఏంచెప్పను. (నిష్క్రమించును)

శర—అమ్మయ్య వెళ్ళినాడు. (అడుగులు చప్పుడువిని) మళ్ళీ యెవరో వచ్చుచున్నట్లున్నారే. (పరికించి) పేరయ్యశాస్త్రులుగారు నాబోలు!

[పేరయ్యశాస్త్రి ప్రవేశించును.]

శర—ఓహో! పేరయ్యశాస్త్రిగారా! బహుకాలదర్శనం దయచేయండి. ఏదోపనిమీద వచ్చినారు.

పేర—(తనలో) ఈయనదగ్గిర కొంచెం డబ్బు వ్యాపారం కదిపి తరువాత మాటలసందడిలో మాధవరావుగారి పిల్ల వివాహవిషయం మాట్లాడవలెను. (ప్రకాశముగా) పంతులుగారితో పనిలేకుండా వుంటుందా! లఘౌధికార్లు.

శర—ఎవరికైనా ఋణము కావలసివచ్చిందా యేమిటి?

పేర—అదేపని.

శర—ఏమాత్రం.

పేర—చెప్పతానుగా. వీలవుతుందా ?

శర—వీలవడానికేమిగాని, వడ్డీరేటు ఇప్పుడు జాస్తీగావుంది. వ్యాపారస్థులు డబ్బుకు గిజగిజలాడుతున్నారు. అయినా యెవరికి, ఎంత, చెప్పరుకదా.

పేర—చెప్పడానికేమిలెండి. కానాలిపదివేలు.

శర—ఆస్తి.

పేర—ఆస్తి కేమీ పరవాలేదు. బంగారమువంటి పల్లంపొలం యెకరం, రెండుపుట్లుపండేది ఇరవై యెకరములు తాకట్టు.

శర—పొలంధరలు కట్టడం కష్టం.

పేర—చాలకపోతే 4 యకరముల అంటుమామిడితోట కూడ పెట్టుతారు. వడ్డీ ఏలాచేసి యిప్పిస్తారు చెప్పండి.

శర—మామూలే.

పేర—అది సెలవియ్యండి.

శర—రూపాయిన్నర.

పేర—సరే. ఇది కుదరని వ్యాపారం. (లేవబోవును)

శర—(చెయిపట్టుకొని) మరి యేలాగు కుదురుతుందో చెప్పండి.

పేర—ఇన్నిమాటలు అవసరములేదు. మామామూలు మాకున్నట్టే పద్ధతిని అర్ధరూపాయి వడ్డీ గిట్టితే యివ్వండి.

శర—ఆతణఖాఆస్తి సంబంధమయిన కాగితములుచూడవలెను. ఈ కాస్త వడ్డీవ్యాపారంలో మీమామూలుకూడానా?

పేర—మీ కిష్టమైతేనే. లేకపోతే మిరియాలవారిదగ్గఱ యిప్పిస్తాను.

శర—సరేలెండి. కాకితాలు తెప్పించండి.

పేర—మంచిది. (లేచి) అన్నట్టు మఱచినాను. మన భైరవమూర్తికి యింకా వివాహం చెయ్యలేదేమి?

శర—నేనూ అదేప్రయత్నంమీదవున్నాను. సంబంధములు అనేకము లువచ్చి తిరిగిపోతున్నవి. రెండువేలన్నవారు మూడువేలన్నవారు అనేకమంది.

పేర—ఎవరేమియిస్తామన్నా సంప్రదాయము చూడవద్దా! సంఘూరి మాధవరావుపంతులుగారిని మీరెఱుగుదురా?

శర—ఎఱగకేమి ఆయనవద్ద యిద్దరుకుమార్తె లున్నారట.

పేర—పెద్దపిల్లకు యిప్పుడు పెళ్ళిచేయదలచుకొన్నారు. పిల్ల అంద మైనది. చిదిపి దీపంపెట్టవచ్చును. వంగడమూ చాలమంచిది.

శర—కట్న మేమాత్ర మియ్యగలరు?

పేర—వారు కట్నములిచ్చి వివాహముచేయు తలంపులోవారు కారు. మొదటినుంచి సంఘసంస్కరణ పరాయణులు; వరశుల్కము నిషేధించవలయునని యుపన్యాసము లిచ్చువారిలో నొకరు. అందుకని ఆపేరు చెప్పితే వారు వొప్పుకోరు. ఏదోమాస్తరుగా పెండ్లికొడుకునకు సంతోషపూర్వకంగా యిచ్చేది అని వొక వేయి రూప్యములు మట్టుకు తీసికొనవచ్చును.

శర—అట్లయితే ఈసంబంధంవల్ల నాకాట్టే ప్రయోజనం కనబడలేదు అయినా! పిల్ల లక్షణములు మంచివేనా?

పేర—పిల్లా- పిల్లకాదు. ఉక్కుతునక.

శర—నాకు మతేమీలేదు. ఇంటిపనులన్నీ చక్కబెట్టుకోవాలి. మా యింట్లోనూ అట్టేమంది లేరు. కాస్త ఉడకేసి పెట్టగల సామర్థ్యముండాలి.

పేర—దానికేమీ పరవాలేదు. అది నాపూచి. చక్కగా చదువుకొన్నది.

శర—చదు వెవ్వరికి కావాలి. చట్టుబండల చదువు. దున్నపోతులాగు నడుంవంచి పనిచెయ్యవలెను. అంతా బాగానేవుంది గాని కట్నం మాత్రం కొద్ది.

పేర—మీరా రా విషయంలో సందేహించకండి. పిల్లదాని వంటిమీద 1000 రూపాయల నగలున్నవి. ఇదిగాక తాతగారు సంవత్సరము నకు 500 రూపాయలు వచ్చే పొలం వ్రాసియిచ్చినారు.

శర—మాధవరావుగారికి వున్న అసలు ఆస్తి యేమాత్ర మేమిటి?

పేర—వారికా! ఏమనిచెప్పను. ఆయన సర్కారుపని చేసి పింఛను తీసుకొన్నాఁడు. పించనేమో నెలకు నూటయేభైరూపాయలు వస్తాయి. పిత్రార్జితమైన పొలం పదియెకరాలువుంది. ఇల్లు, నాలుగిళ్ల భవంతి; చాలా పెద్దది. అద్దెవల్ల నెలకి ఇరవై రూపాయలు వస్తాయి.

శర—ఇకనేమి? అల్లాగయితే ఒక సంగతి చెప్తాను వినండి. అది యుభయతారకమైనది. మీరు వెయ్యి రూపాయల కట్నమే అంటు న్నారు గనుక ఏమీ మాట్లాడను. డబ్బువిషయంలో ఆపొలం కుర్ర వాడికిచ్చి, నలుగురితో బాటు యిచ్చినామన్న పేరుకు 1000 రూపా యలు కట్నముచ్చు, వెండిచెంబులు, వెండికంచం, పట్టుబట్టలు, బైసికిల్ బండి, బంగారపది రిస్టువాచి, మొదలగునవి మోజుకోసము ఏర్పడినవి గనుక యియ్యమని చెప్పండి.

పేర—శరభయ్యగారూ! మీకు ఎవరూ సంతృప్తి కలుగఁజేయలేరు. మీతో వ్యాపారం కుదిరేదికాదు. అనవసరంగా కాలయాపనం చెయ్యడం తప్ప మరేమీ లాభంలేదు; వెళ్లుతాను. (వెళ్లఁబోవును)

శర—(పట్టుకొని) అంత తొందరపడుతారు యెందుకు? వ్యాపారం మాటలాడడానికి వచ్చినవారి కింత తొందర పనికిరాదు. నే చెప్పిన దానిలో ఏమయినా తేడావుంటే చెప్పండి.

పేర—తేడా ఏముందిలెండి. ఉన్నదంతా మీపిల్లవాడికి కట్టబెట్టి తరు

వాత మాధవరావు పంతులుగారిని ముష్టి చెంబు చేత బుచ్చుకోమని చెప్పుచున్నారు. ఇదేగా! చాలు, చాలు. ఎవరైనా వింటే ఈమాట నవ్విపోతారు.

శర—పోనీ, మీయుద్దేశము చెప్పరాదూ!

పేర—నాయుద్దేశ మేమున్నది. మొదటనే చెప్పినాను. వెయ్యి రూపాయలని

శర—పేరయ్యశాస్త్రులుగారూ! అనకూడదు గాని మీతాతగారి సొమ్మంతా ఖర్చుపడేటట్టు మాట్లాడుతారేమండీ. ఇటువంటి విషయములలో నాసంగతి మీకు తెలుసును. కావున ఏదో మీరు కష్టపడి వ్యాపారం నిండుగా ఫయిసలు చేసి, నావల్ల మీరు తృణమో, ఫణమో, స్వీకరించి సంతోషించాలి గాని యీలా తొందరపడితే యేలాగు.

పేర—(తనలో) ఈయన యుద్దేశం తెలిసింది. కట్నము యెక్కువగా యిప్పిస్తే నాకు కమీషను వుంటుందని తెమిల్చాడు. కానీ, యుభయపార్టీలవద్ద గుంజుకొనవచ్చును. (ప్రకాశముగా) శరభయ్యగారూ! నావిషయం గూడా మీరు దయతో ఆలోచిస్తున్నారు గనుక చెప్పుచున్నాను. కట్నమియ్యనన్న దీక్షలో వారు మాధవరావుగారు. అల్లాటాయన్ని వెయ్యి రూపాయలలోకి దింపడమే కష్టము. అయినప్పటికి ఒక చిత్రం చేద్దాము. ఇంకోమాట. రెండు వేల రూపాయల కట్నము వచ్చేటట్టయితే నాకు కమీషన్ యెంత చెప్పండి.

శర—రెండు వేలకే కమీషనా! ఈస్వల్పంలో నీకు గూడా భాగము పంచిపెట్టవలయునా? అబ్బే! ఏమంత గొప్ప వ్యాపారము. నచ్చని మాట చెప్పినావు. నాలుగు వేల రూపాయలయితే ఏమయినా కొంచెం చూడవచ్చును.

పేర—అదిగో! కొంచెమంటున్నారు. కొంచెమనగా ఎంత?

శర—ఏదో పది రూపాయలు ముట్టచెప్పక పోతాను.

పేర—అదేమీ పనికిరాదు. పెళ్ళికి వంద ఏర్పాటు. నాలుగు వేల యితే నాలుగు వందలు.

శర—అమ్మబాబో! యింతకమీషనే. ఇంతడబ్బియ్యాడమంటే ఒక్కనారి గుండెలు పగిలిపోవు! అవతల వారిదగ్గిఱ ఏమిపుచ్చుకొంటారు

పేర—అక్కడసంగతి మీకు ఎందుకు మీసంగతి తెమల్చండి.

శర—ఏదో ఒకటి చూదాము. కానియ్యండి.

పేర—అయితే నేను మాధవరావు పంతులుగారిని రేపటిరోజున యిక్కడికి తీసుకొనివస్తాను. మాధవరావుగారిచేత కట్నం ఎక్కువ పెట్టించడానికి విస్తరాకుల వీరయ్యని ఒక పాత్రగా చేద్దాము. వాడితో నేను అన్నిసంగతులు మాట్లాడి మీదగ్గిఱకు పంపుతాను. మాధవరావుపంతులుగారు మీదగ్గిరకు వచ్చేటప్పటికి వాడుండాలి; చెయ్యవలసినదంతా నేనుచెప్పుతాను రండి. (నిష్క్రమింతురు.)

రంగము:—శరభయ్యగారి పడకగది.

[ప్రవేశము సీతమ్మ]

సీత—(తనలో) అక్కటా! నాజన్మ మెంత నిరర్థకమైపోయినది. నేని పాడు ఆడజన్మమేలయెత్తితినోకదా! ఛీ! ఇట్టిదాంపత్యము పగతుర నను వలదు.

తే. గీ. ధనమునకు నాసఁ జెంది వృద్ధునకొసంగి
పెండ్లిగావించు వారికి బిడ్డయగుచు
జననమందుటకంటెను వనమునందు
పృథ్వీరుహంబుగాఁ బుట్టుట మేలుకాదె.

నాకుఁ బ్రాప్తించిన యీసంబంధమున క్షేమని వగతును.

తే. గీ. ధనమె ముఖ్యం బటంచును దలఁచి పిసిని
గొట్టు వృద్ధునకును నన్నుఁ గూర్చి
పాపులై తల్లిదండ్రులు పడుచునైన
నాకు నిట్టివంతనుగూర్చి నారు కాదె.

నిశ్చయముగా నాతల్లిదండ్రులు నన్నీవృద్ధునకుఁ గట్టి నాగొంతుకఁగోసినారు. అక్కటా ! నాకర్మమునకు నేనేమని చింతింతును. ఎట్టి మగనిం గట్టుకొని కాపురము సేయవలసివచ్చినది !

సీ. నగనాణెములు గోర నవ్వుచు, నున్నవి
చాలవాయంచును జాలఁబలుకు
కట్టుకొంటకుఁ జీర కావలెనని కోర
చిట్టుబుస్సంచును జేరి తిట్టు
సద్గ్రంధములఁ గోర సతులకు నీ పాడు
చదు వేలయంచును వదరుచుండు
ఏమైన నోములు నేఁ జేతుననిపల్కఁ
జాలుపుణ్యంబని సణుగుచుండు

గీ. బ్రాహ్మణులపూజ గావింప వలయునంచుఁ
బలుక పితృదినంబా యంచుఁ బలుకుచుండుఁ
గటకటా ! యిట్టిభర్తతోఁ గాపురంబు
జేయవలసినయందుకుఁ జింతపడుదు.

సీ. వీధివాకిటనిల్వ వెలయాలివనిపల్కు
జడ వేసికొన్నచోఁ జాలగొణుగు
తాంబూలమును వేయఁ దగదంచుఁనుడువును
నసిరితోమాట్లాడ కసరుకొనును
ఏదైనవ్రాయంగ నెవరికుత్తరమను
దొడ్డిలోనికిబోవ నడ్డుపడును

వీణెవాయించిన ॥ వెగటుగాఁ జూచును
పాటపాడిన నది ॥ పాపమనును
గీ. ఇరుగు పొరుగువారలతోడ ॥ సింతముచ్చ
టించగ రహస్యమేమున్న ॥ దంచుపలుకుఁ
గటకటా! యిట్టిభర్తతోఁ ॥ గాపురంబు
జేయవలసిన యందుకుఁ ॥ జింతపడుదు.

ఇంటి కెవరైన వచ్చిన యనుమానము. వంటనరసయ్యతో మాట్లాడు చున్న పొంచివినును. ఎక్కడకైననొంటిగాఁబోవుట తటస్థించినచో నను మానమంది అమ్మ యొంటిగా బోవుచున్నదని పలికి వెంట దత్తపుత్రుని బంపించును. ఇఁక నింటివ్యాపారము దలఁచుకొన్న నవ్వును, నేడ్పుఁగూడ వచ్చును. ఏదినమున కాదినము తాను స్వయముగా వంటకు నుప్పు పప్పు సామాను మొదలగునవి యన్నియు నిచ్చును. పిడకలయినను గట్టెలయినను లెక్కపెట్టనిదే యియ్యఁడుకదా. పెరటిలో మల్లెపువ్వులు పూయుచున్నవనుమాటయేగాని ఎన్నడును మనసార యొకసారియైన బెట్టుకొని యెఱుఁగను. అన్నియు బజారునకుఁ బంపి యమ్మించును. నేను కాపురమునకు వచ్చినదిమొదలు యింటిలోని వూరగాయ లేకున్న గోంగూరపచ్చడి యివితప్ప కూరమొగ మెన్నడూ యెఱుగనుగదా. (ఇంచుకయూరకుండి) పరమేశ్వరుఁడు నాకెప్పుడీ తనువునుండి విముక్తి కలుగఁజేయునోకదా!

శరభయ్య—(ప్రవేశించి) ఓహో! నాముద్దులసీతయేనా యిక్కడ యున్నది?

సీత—ముద్దులసీతకాదు. ముక్కలసీత.

శర—ఎప్పుడు నన్నుఁ జూచినా కొఱకొఱలాడుచునే వుంటావుకదా. ఇది నాకర్మము కాబోలు!

సీత—అది మీకర్మముకాదు. నాకర్మమే.

శర — ఏమికర్మము?

సీత — మీయట్టివారిని వివాహమాడుటయే. ఇంతకంటె కావలసిన కర్మ మేమున్నది?

శర — నామీఁద నీకు ఇంత ఆగ్రహ మెందుకో చెప్పు.

సీత — మూడుకాళ్ళ ముసలివారైన మీరు చిన్నదాననైన నన్ను వివాహమాడి నాగొంతుక కోయఁగోయుటయే. ఇంతకంటెఁ గావలసినదేమున్నది. అయినను మిమ్ములను గూడ ననవలసిన పనిలేదు.

తే. గీ. విద్య మొదలైన గుణముల ♦ విడిచిపెట్టి
ధనమె ముఖ్యంబటంచును ♦ దలఁచి మూడు
కాళ్ళ ముదుసలికి సుతను ♦ గట్టిపెట్టు
తల్లిదండ్రుల కుత్తుకల్ ♦ దఱుఁగవలయు.

అట్లు చేసినను బాపము సంభవింపదు. కాకున్న నాకయస్సెక్కడ! మీవయస్సెక్కడ! మనదాంపత్యము జూచి నలుగురు నవ్వుచున్నారు. దాంపత్యసుఖము విషయమటుంచుడు. చేసికొన్నందుకు భాగ్యవంతు లయినందున కోరిన చీరె, కడుపునిండ తిండి, వలసిన వస్తువులు అయిన నివ్వవలెనా?

శర — నేను నీవిషయమై చేసిన లోటేమున్నది.

సీత — ఇంతకంటెఁ గావలసిన దేమున్నది. ఎప్పుడైనా సంతోషపూర్వకముగా నొక్క చీర తెచ్చి యిచ్చిరా? తుదకుఁ బెరటిలోఁ బూవులైనఁ దలలో ముడిచికొన నిచ్చిరా? కడుపునిండఁ గూడయిన నెఱుఁగుదునా?

శర — పిచ్చిదానా? ఇదియంతయు నీమీఁదఁ గోపముచేత ననితలంచితివా? డబ్బు వృథగా ఖర్చుపెట్టుటకిష్టము లేక. ఇదియంతయు నెవరికొఱకు?

సీత — ఈదాచుట యంతయు నానిమిత్తమే. నేను చచ్చినప్పుడు నా పాడిమీఁద కట్టిపెట్టెదరు కాబోలు! సంపాదించినందుకు అనుభ

వించకుండనా ! ఇట్టి పిసినిగొట్టుతనము మీకెట్లువచ్చినదో తెలి యదు. బహుశః జన్మతో పుట్టినదే యని తలంచెదను.

శర—ఒక్క రహస్యము నీకుఁ జెప్పెదను వినుము. డబ్బు బాగుగ సంపా దించి మూటగట్టువాఁడు ఖర్చుపెట్టుటకు సాహసింపఁడు. అంటు మామిడితోట కష్టపడి ఒకఁడు వేయును. దాని ఫలితమును వేఱొకఁ డనుభవించును. ధనమున్నవాడు బహుచక్కని యిల్లుకట్టును. అద్దెకు గాపురముండువాఁడు మఱొకఁడు. ముండనుంచుకొని పోషించు వాఁడొకండై యుండగా దానికి మిండగాడై సౌఖ్యమనుభవించు వాఁడు వేఱొకడై యుండును. అట్లే గణించువాడొకడు గుణించువా డొకడు ప్రపంచమంతయు నిట్లే యున్నది. తెలిసినదా. వెఱ్ఱిమొగమా ! చీరలంటావు సారెలంటావు తిండియంటావు తిప్పలంటావు కావలసినన్ని. అబ్బాయిపెళ్ళి వస్తూవుంది, నీకు కావలసినన్ని చీరలు వియ్యాలవారిస్తారు. అయిదురోజులూ పిండివంటలతో భోజనం హాయిగా చెయ్యవచ్చును. కలువుతీరుతుంది. మనసొమ్ము ఖర్చుపెట్టి చేస్తే యేమి తచెయ్యగలము. ఒకరికొంపతియ్యవలెను, మన కడుపు నిండవలెను, తృప్తికలుగవలెను.

సీత—మీరావి మంచియుద్దేశములే. ఇవి ముందునకు వచ్చుమార్గములే. అబ్బాయి పెళ్ళి అంటిరే, అబ్బాయి పెళ్ళియా ! మీ పెళ్ళియా !

శర—నీవుండగాఁ బెండ్లి యెట్లు.

సీత—ఏమో డబ్బుకాసించి నాతల్లి దండ్రుల బోటి పాపాత్ములు యెవరైన మరల పెళ్ళిమీద పెళ్ళికి పిల్లను మీకీయనెంచినారేమో అనుకొన్నాను. ఎవరైనా యిచ్చేవారుంటే మీరుసిద్ధపడుతారులెండి.

శర—చాలు. చాలు. అదికాదే అబ్బాయిపెళ్ళే.

సీత—పరమలోభులగు మీతో వియ్యమందుట కిష్టపడినవారెవరబ్బా!

శర—ఏమే అట్లంటివి. సందూరి మాధవరావుగారి పెద్దకుమార్తె

యయిన సుశీలను మన అబ్బాయి కియ్యడానికి చూస్తున్నారు. ఈవాళో రేపో వారు మనతో మాటలాడడానికి వస్తారు.

సీత—బాగా నేవుంది గాని వారు వస్తే మొగమంతా అసహ్యంగావుంటుంది క్షౌరమయినా చేయించుకోండి. ఇప్పటికి నాలుగుమాసములయింది.

శర—హైదరాబాదు మంగలులు నాల్గణాలు యిచ్చినగాని చెయ్యరు. మామూలువాళ్ళని పిలిచి అణా చేతిలో పెట్టితే ఉత్తర దక్షిణములకు ఒకటే గీటుగీస్తాడు.

సీత—పోనీ! ఈయవస్థ అంతా లేకుండా ఇప్పటివాళ్ళ పంథిణేగా "సేఫ్టీ రేజరట" తెచ్చివుంచుకొంటే మీరేచేసికొనవచ్చునుగదా!

శర—దానికి ఒకసారే రూపాయపావులా పెట్టడమంటే కష్టము.

సీత—మనము పోవునప్పుడీసొమ్మంతయు గట్టుకొనిపోవుదుము కాబోలు?

శర—బ్రహ్మకు సృష్టిసేర్పు తెలియలేదు.

సీత—పోనీ మీరువెళ్లినప్పుడతనితో వాదించి చెప్పవచ్చును లెండి. (ఇంచుకయూరకుండి) ఇంతకును క్షౌరము చేయించుకొందురా లేదా?

శర—ఇప్పుడామాట తలపెట్టకు. అబ్బాయి పెళ్ళిప్రయత్నంలో వున్నప్పుడు క్షౌరమేమిటి. (నిష్క్రమించును)

సీత—(ప్రక్కంజూచి) నరసయ్యా!

నర—(ప్రవేశించి) అమ్మా! ఏమి?

సీత—నేడేమో యాకలి యిప్పుడే వేయుచున్నది. కొంచెము శ్రమయనుకొనక త్వరగా వండెదవా?

నర—ఇప్పుడే మడిగట్టుకొనెదను.

శర—(ప్రవేశించి) ఏమిటది. ఏమిటది. నరసయ్యా! కొంచెంపనివుంది ఈలారా? నువ్వు ఈగదిలోనికి ఎందుకువచ్చినావు?

నర—అమ్మగారు వంటపెంద్రాళే చెయ్యమని పిలిస్తే వచ్చినాను.

సీత—(తనలో) ఈయన యనుమానమునకు నేనేమని చింతింతును (నిష్క్రమించును)

శర—నీవిప్పుడును పడకగదిలోనికి రాను రా. (నిష్క్రమింతురు)



రంగము—శరభయ్యగారి కచేరిచావడి.

[శరభయ్యగారు, వీరయ్యగారు, భైరవమూర్తి ప్రవేశము]

శర—వీరయ్యా! నీవు నావిషయంలో ఏమిాసందేహించనక్కఱలేదు. కార్యం ఫలించింది అంటే నీకేమిగోటుపుండదు. ఇరవైరూపాయలు పద్దు నీకు పడ్డదనే భావింపవచ్చును.

వీర—తమదయవుంటే నాకు లో ఏమున్నది. ఇటువంటి కార్యములు వచ్చినప్పుడే మాబోటివాళ్లకు కాస్త కడుపునిండడం. ఇట్టివిషయములో అవతల మనిషిని బోల్తాకొట్టించడానికి నన్ను మించినవారు లేరులెండి. మనంమాత్రం మాధవరావుగారు వచ్చేసరికి ఆయనకు హాడలుపుట్టేమాటలు మాట్లాడుతూవుండవలెను.

శర—ఈమాటలు నీవు నాకు నేర్పనవసరము లేదు. (ఎదుటజూచి) అదిగో అనుకొన్నంతలోనే మాధవరావుగారు పేరయ్యశాస్త్రులుగారితో వస్తున్నారు.

[పేరయ్యశాస్త్రి, మాధవరావుగారు ప్రవేశము]

వీర—ఏమంటారు మిాయభిప్రాయమేమిటి. సింగరాజువారికి మిాకూ యిదివఱకే బాంధవ్యమున్నది. డబ్బుకు చూచుకోకండి. పదిహేను వందల రూపాయలు నేనుయిప్పించెదను. ఇదిగాక వెండికంచం చెంబువగైరాలు పెట్టించెదను.

మాధ—(పేరయ్యశాస్త్రిని జూచి రహస్యముగా) ఇదేమిటండీ. శరభయ్యగారు మరేదో సంబంధంవిషయం మాటలాడుచున్నట్లున్నది.

పేర—ఈవీరయ్యగాడికూడ చేరినాడు. వీడు కొంపలంటించే ముండా కొడుకు. కానియ్యండి. మరేంపరవాలేదు. (శరభయ్యగారిని సమీపించును)

శర—(లేచి) రండి బావగారూ' (చేయిబట్టుకొని మాధవరావుగారిని కూర్చుండఁబెట్టును)

మాధ—మీరేదో రహస్యంమాటలాడుచున్నట్లున్నారు. మీసంభాషణకు నేనంతరాయము గలిగించితినికాబోలు!

శర—రహస్యసంభాషణ ఏమీలేదు. ఈపెళ్లికబురులకు జవాబు యియ్యలేకుండా వున్నాను సింగరాజువారు వీరయ్యచేత తమ పిల్లను యిస్తామని కబురుపంపించినారు.

పేర—(వీరయ్యనుజూచి)నీవా బాబూ! కబురుతెచ్చింది. కట్నమేమాత్రమేమిటి.

వీర—పది హేనువందలు అవసరమైతే నాయిష్టప్రకారముకొంతవఱకు ఎక్కువ చెయ్యమని నాకు సెలవిచ్చియున్నారు.

పేర—శరభయ్యగారూ! నేను ముందు తమతో మాధవరావుగారి విషయం మాట్లాడివున్నాను. మీరు మరల నింకొకసంబంధమును గుఱించి మాటలాడుట మంచిదికాదు. సింగరాజువారు పది హేను వందలు యిస్తామన్నారు. కావున ఆమొత్తమే మామాధవరావు గారు యిస్తారు. అంతమాత్రమియ్యలేనివారు కారు.

వీర—వా రిస్తానన్న మొత్తమే వీరిస్తారంటే విశేషమేమియున్నది.

పేర—ఓహో! నీవు ఈలావచ్చినావా! (శరభయ్యగారినిఁ జూచి) శరభయ్యగారూ! మీయభిప్రాయమేమిటి?

శర—నన్నేంచెప్పమంటారు. వీరయ్యచెప్పినమాటలో నిజమున్నది.

పేర—(మాధవరావుగారిచెవిలో నేదో చెప్పి శరభయ్యగారిని జూచి) శరభయ్యగారూ! అట్లయితే మామంతులుగారు మఱి రెండువందలు యెక్కువయిస్తారు అనగా పది యేడువందలు.

వీర—అయితే సింగరాజువారిపాట రెండువేలు భర్తీ.

పేర—వీరయ్యా! నీ వేమను నాకేమీ బాగాలేదు. అనవసరమైన జోక్యము కలుగఁజేసికొని వ్యాపారములన్నియు నిట్లే చెడగొట్టుచుందువు.

వీర—బా.గున్నది. నేనూ ఇదే వ్యాపారంమీద సింగరాజువారిపక్షమున వచ్చినారు. వారు పెట్టమన్న గాఋ్ము పెట్టెదను.

పేర—(మాధవరావుగారిని జూచి) మాధవరావుగారూ! ఏమైనను సరే. మీతరఫున నేనే మాట్లాడుతున్నాను. వీరయ్యా! మాపంతులుగారిపాట రెండువేల రెండువందలు.

వీర—మాపాట రెండువేల అయిదువందలు.

పేర—ఆ! ఏమిది! కానీ చూతాము. మాపాట మూడువేలు.

వీర—ఓసబ్బో! ఇంతమాత్రమున జడుస్తామనుకొన్నావా యేమిటి. ఇదిగో మూడువేల అయిదువందలు పెట్టుచున్నాను. ఇక కానీ.

భైర—(తనలో) ఇదియంతయు నాకుఁ జిత్రముగనున్నది నాయనగారును వీరయ్యయు నేదో మంతనమాడి యిట్లు చేయుచున్నట్లు తోఁచుచున్నది.

తే. గీ. గుడ్డలాదిగ వస్తువుల్ 'గుజిలి' లోన
వేలమున బాడువిధమున బొడ్లిగొడుకు
నకట కట్నంబు కొఱకిట్లు లవనియందు
వేలమున బాడుచున్నారు కాలమహిమ.

పేర—(శరభయ్యగారినిజూచి) శరభయ్యగారూ! మాపంతులుగారు పెట్టదలచినది పెట్టినారు. ఇక మీయిష్టము. తుదకు గట్నములు వేలముపాటలోనికి గూడ దిగినవి.

మాధ—శరభయ్యగారూ! ఇఁక మా కనుజ్ఞ నిచ్చెదరా?

శర—నే నేమిచెప్పగలను. వ్యాపార మిట్లున్నది.

పేర—పంతులుగారూ ! మీకేమయినా పిచ్చాయేమిటి రండి. (మాధవరావుగారును పేరయ్యశాస్త్రిలును నీవలకు వత్తురు.)

శర—వీరయ్యా ! మహాతమాషాగా పాటపెట్టించినావు.

వీర—బాబూ! ఈలాటి టక్కుటమార గజకర్ణ గోకర్ణ విద్యలు నాకు జెప్పనక్కఱలేదు.

మాధ—(పేరయ్యశాస్త్రిని జూచి) చూచినారా ? పేరయ్యశాస్త్రులుగారూ! తానొకటితలచిన దైవమింకొకటి చేయునన్న సామెత నిజమైనది. వెయ్యిరూపాయలనుకొన్నది ఎంతవఱకు అయినదో చూచినారా ?

పేర—ఈవీరయ్యగాడివలన యింతవఱకువచ్చినది. కానిసొమ్మెంతయినా ఆసంబాధముమాత్రం వజ్రమువంటిది. ఇటువంటిసంబంధము మనము ఇరవైరెండుజిల్లాలలోను తేజాలము అని ఢంకావేసి చెప్పగలను.

మాధ—శరభయ్యగారు మూడువేలకు సింగరాజువారికి ఖాయం చేస్తారేమో అనుకొంటాను.

పేర—నేను అదేచూస్తున్నాను. పోనీ ఒకపనిచేద్దామా! మీకిష్టమైతే మూడువేల అయిదువందలవరకూ రానేవచ్చినది కదా ! మనము యిప్పుడు వేలంపాటతో అవసరము లేకుండా ఇకనొక అయిదువందల రూపాయలు యిచ్చెదమనిచెప్పుదాము. ఆయనవప్పుకొని మన సంబంధమునకు ఇష్టపడితే మంచిదే ; లేకపోతే పోనియ్యండి. ఏమంటారు ?

మాధ—ఇంతవఱకును వచ్చినప్పుడు వెనుదీయడమేల. అదికూడ చూడవచ్చును రండి. (ఇంచుకనడిచి శరభయ్యగారిని సమీపింతురు.)

పేర—శరభయ్యగారూ ! మాపంతులుగారు ఏకముగా నాలుగువేలు ఇయ్యదలచుకొన్నారు. ఆపైన మీయిష్టము. వేలంపాటతోపనిలేదు.

శర—(వీరయ్యనుజూచి) వీరయ్యా ! విన్నావా? ఏమంటావు ?

వీర—ఏమనేదేమున్నది. ఇక మేము పెట్టదలఁచుకొనలేను. మీ యిష్టం వచ్చినట్లు చేసికొనవచ్చును.

శర—అట్లయిన మాధవరావుపంతులుగారూ! సంబంధం మీ క్రింద ఖాయం.

పేర—వ్యాపారం కుదిరింది గనుక దీనికి అడ్వాన్సువుంచుట మంచిది. పంతులుగారూ! తమవద్ద ఇరవైయైదు రూపాయలువుంటే శరభయ్యగారికిచ్చి రశీదుపుచ్చుకోండి. ఇట్లుచేయుట యుభయత్రా మంచిది.

మాధ—ఇవిగో (రూపాయలు శరభయ్యగారి కిచ్చును).

శర—(పుచ్చుకొని) రశీదు వ్రాసియిస్తాను. (రశీదు వ్రాసి చదువుచున్నాడు).

బ్రహ్మశ్రీ నందూరి మాధవరావు పంతులుంగారికి—మాచిరాజు శరభయ్య వ్రాసి యిచ్చిన రశీదు. నా కుమారుడగు చి॥ భైరవమూర్తిని మీకుమార్తెయగు చి॥ సౌ॥ సుశీలకు యిచ్చి వివాహము చేయుటకున్నూ, అందుకుగాను కట్నము క్రింద మీవద్ద నుంచి నాలుగువేల రూపాయలు పుచ్చుకొనుటకున్నూ నేను ఒప్పుకొని అడ్వాన్సు క్రింద మీవద్దనుంచి రొఖపూర్వకముగా యీరోజున రూ 25 పుచ్చుకొన్నాను గనుక ముట్టినవి. పదరుకట్నము గాక మీరు పెళ్లికుమారునకు వెండికంచము, చెంబు, రిష్టువాచి, బైసికిల్ బండి, అయిదురోజులు అయిదు పట్టుతాబితాలు యిచ్చుటకున్నూ వియ్యంకునకు విశ్వపురాలునకు యథావిధి లాంఛనములు జరుపుటకున్నూ, మాతరపున వచ్చిన బంధువులకు అందరికీ అప్పగింత సమయమున బట్టలు పెట్టుటకున్నూ, ప్రతిపూట మమ్ము భోజనమునకు బ్యాండువగైరా వాద్యములతో పిలచుటకున్నూ, మువ్పొద్దుల ఫలహారములు పెట్టుచుండుటకున్నూ, నిర్ణయించుకోవడమైనది.

మాచిరాజు శరభయ్య వ్రాలు

పేర—(తనలో) ముండాకొడుకు బాగా బిగించినాడు. (ప్రకాశముగా) బాగున్నది బాబూ!

మాధ—బావగారూ! ఇక మేము వెళ్ళి వస్తాము.

శర—చిత్తము. (తెరపడును).

ఇది ద్వితీయాంకము.





శ్రీరస్తు.

# వరవిక్రయము.

## తృతీయాంకము

రంగము:—రాజవీధి.

[ప్రవేశము—మాధవరావు పంతులుగారు]

మాధ—ఆహా! కాల మెంత విపరీతముగా నున్నది. అల్లునకుఁ గట్నమిచ్చుట కున్న పొలము, అమ్మియో తాకట్టుపెట్టియో యియ్యవలసి వచ్చినది కదా! ఆస్తిమీద అప్పుదెచ్చుట గూడ కష్టమే. ఎంతమంది దగ్గఱకుఁ బోయినను డబ్బు యిప్పుడు లేదన్నవారు కొందఱు- వడ్డీ యెక్కువడిగినవారు కొందఱు-అనుకొన్న వాయిదాలోగా యియ్యకపోతే కాంపౌండువడ్డీ కట్టుకొంటామన్న వారు కొందఱు- ఈవిధముగా నున్నారు. ఇక నేనిప్పుడేమి చేయుదును. కానీ! మార్వాడీ వర్తకుడయిన గణపతిలాలును గూడ విచారించెదను. (ఇంచుక నడువగా తెర లేచును).

[గణపతిలాలు కొట్టు- గణపతిలాలు ప్రవేశించును]

గణ—మాధవరావు పంతులుగారా! రాంరాం. దయచేయండి.

మాధ—(కూర్చుండును).

గణ—పంతులుగారు ఏదో పనిమీద వచ్చినారే.

మాధ—పనివుండియే వచ్చినాను. కొంచెం సొమ్ము కావలసి వచ్చినది

గణ—తమకు అభ్యంతర మేమున్నది. ఎంతసొమ్మేమిటి. సాధారణంగా మీరు ఒకరిదగ్గఱకు వచ్చువారు కారే.

మాధ—రావలసి వచ్చినది. ఆరువేల రూపాయలు కావలసివచ్చినది. మా పెద్దమ్మాయికి వివాహము చేయదలచినాను. ఈవిషయములో కావలయును.

గణ—మంచిది. పెళ్లికొడుకు యెవరు ?

మాధ—మాదిరాజు శరభయ్యగారి అబ్బాయికి.

గణ—శరభయ్యగారా! అబ్బో! ఆయన "బడా" మహారాజే. బాగా డబ్బు వున్నవారే. ఆయన చాలా వడ్డీవ్యాపారం చేస్తూవుంటారు. ఇతరుల దగ్గఱ పుచ్చుకొనుటకన్న వారిదగ్గఱనే పుచ్చుకొంటే మంచిది కదా !

మాధ—చాలు. చాలు. ఆయనతో వియ్యమందబోతూ- ఆయన దగ్గఱ అప్పా! ఇంతకంటె నగుబాటేమయిన గలదా! ఇంతకును మీరేమందురు?

గణ—ఆస్తి తణఖా యేమిటి ?

మాధ—పది యకరముల పల్లంపొలం.

గణ—ఆసంబంధమైన కాగితములు చూడవలెను. ఇదిగాక వడ్డీ విషయంలో నూటికి 1-8-0 చొ॥ అయితే వ్యాపారము కుదురుతుంది. అనుకొన్న సొమ్ము మాకు దీపావళిలోపుగా రావలెను. లేనిచో- వడ్డీకి రెట్టింపువడ్డీ. ఇందుకు మీకు సమ్మతమేనా?

మాధ—అబ్బో! ఇది మాకు కుదరని వ్యాపారం. ఎవడో పకీరు అయిపోదలచినవాడు చేయువలసిన పని. అట్లయిన నేను పోయి వచ్చెదను.

గణ—మంచిది. (తెరపడును.)

రంగము:—మాధవరావుగారి యింట్లో గది.

[ప్రవేశము—చారుమతి]

చారు—(పరుగెత్తుచు) అక్కా! త్వరగా రావే. త్వరగా రావే.

సుశీ—(ప్రవేశించి) ఏమే ఆతొందర!

చారు—ఇన్ని పిలుపులకు ఇప్పటికి వచ్చితివా? మించిపోయింది.

సుశీ—మించిపోయిన దేమిటి?

చారు—ఏమిటా! బావని చూడడం.

సుశీ—ఏ బావ?

చారు—ఎంతమంది బావలు! నాలుగువేలు ద్రొక్కంపోసి తెచ్చే బావను.

సుశీ—సరే బాగున్నది. ఇందుకోసమా! ఇంత తొందర.

చారు—ఇంత ఖరీదు యిచ్చుచున్న బావ యేలాగున నుందునోయని
తలంచితిని గాని మన్మథ విగ్రహమే ఆతనిని చూచుటకు నీరెండు
కన్నులును చాలక పోయినవి ఆహా!

మ. మొగమా! పూర్ణశశాంకకోటులను దోషంబుగా విప్పగాఁ గన్నులా
నగు పద్మంబులఁ గుంతలంబులను నోర్నఁ వచ్చు నీలంబులన్
సొగసౌ బాహులతీరు చూడఁగను నాగసుండాల తుండంబులే
మగువా! బావనుమించువాఁడు కలఁడే త్రైలోక్యమండలిన్ రూపునన్

ఆహాహా! వరాలబావ. నీవు చూడకపోయితివి కదా! మన యింటి
ముందునుంచి యిక్కడే వెళ్లినాడు. నీవు చూడకపోయితివి కదా!

సుశీ—అంత ఖరీదైన బావను చూచినచో, శరభయ్యగారు చాలా
అసాధ్యులని కూడా వినియున్నాను. కుమారుని నాకిచ్చుటకు
నాలుగువేలు పుచ్చుకొన్నవాడు, అందుచేత చూచినందుకు గూడ
ఏమయినా డబ్బు పెచ్చుగ నిమ్మనునేమో?

చారు—మంచిమాట జెప్పితివే. నాలుగువేలు పోతేపోయినవి గాని
మాణిక్యము వంటి బావ దొరికినాడు.

సుశీ—పోనీ. ఆబావను నీవైన పెండ్లియాడు. నీకు సంతోషముగ నుండును.

చారు—ఇద్దఱను నొక్కనికే వివాహమాడుటా!

సుశీ—ధర్మశాస్త్రములు వొప్పుకొనవులే. నాల్గువేలు రొఖమిచ్చుచున్నప్పుడు మన మిరువురము గలిసి వారియిల్లు గుల్లజేసి నాన్నగారు యిచ్చు డబ్బు రాబట్టుకొందము.

చారు—మంచిమాట జెప్పితివే. (ఇంచుకయూరకుండి) ఉండు. ఉండు. నాన్నగారు వచ్చుచున్నట్లు తోచుచున్నది.

[మాధవరావుపంతులుగారు ప్రవేశము]

మాధ—(తనలో) అబ్బా!

చ. తిరిగితి నెల్లచోటులను నే దేశనిమీద ఋణంబుగూర్చి యె
క్కరుఁడును న్యాయమున్ దలఁచి నే క్రన్నన నీయడు వడ్డితోడనే
ధరణిసమస్తముల్ గొనఁగఁ నే దద్దయు లోఁదలపోసియుండి రే
కరణిని గార్యసాధనము నే గల్గును తోచక యున్నదక్కటా.

(చారుమతినిజూచి) అమ్మాయీ! మీఅమ్మ యేమిచేయుచున్నది.

చారు—వంట యిప్పుడేయైనది. మీకోసమే కనిపెట్టుకొనియున్నది.

మాధ—మీరువెళ్ళి మీఅమ్మ నిట్లుపంపండి.

చారు-సుశీ—(నిష్క్రమింతురు).

మాధ—ఉష్ అబ్బా!

దుర్గాం—(ప్రవేశించి) అంత ఆయాసపడుచున్నారేమి! వెళ్ళిన పని సానుకూలమయినదా?

మాధ—సులభంగా సానుకూలమగునా! ఆస్తివున్నను ఈదినములలో నప్పుదెచ్చుటగూడ కష్టమైనపనియే

దుర్గాం—ఆస్తిమీద యిచ్చుటకు అభ్యంతరమేమి యుండును.

మాధ—తొలుత మన మల్లే యనుకొంటిమి. దిగినఁగాని లోతు తెలి

యుదు. అప్పు దెచ్చుటకుఁ గూడ కొన్ని విద్యలు నేర్చుకొని యుండ వలయును.

సీ. ధనమే ప్రధానమై ఘనగౌరవము లేని
పరమనీచుని స్తుతింపఁగ వలయు
కుక్కరీతిని వాని కొంపచుట్టును నెమ్మ
దిఁ విసుగుకొనక తిరుగవలయు
మధ్యవర్తులకు నేర్పునఁ గమీషను
గృష్ణార్పణ మటంచు నీయవలయు
షావుకార్ వచియించు షరతు లన్నింటికి
నొప్పుచు బత్రంబు నొసఁగవలయు
గీ. వడ్డి యేరీతిఁ జెప్పిన నడ్డు లేక
తెంపుగాని దానికి సమ్మతింప వలయు
వీని నేర్చియుండినఁగాని వీసమైన
ఋణము గలుగఁబోదెట్టి పురుషునకైన.

నే నెప్పుడును నిట్టి లావాదేవీలు పడినవాఁడను గాను.

దుర్గాం—అయితే మీ కెవ్వరును నప్పు నియ్యనన్నారా యేమిటి ?

మాధ—ఇయ్యమని యెవ్వరును చెప్పరు. అందఱును వడ్డీ యెక్కువ యడిగినవారే.

దుర్గాం—పోనియ్యండి. ఏదోమొత్తముగా ప్రస్తుతము తీసికొనివచ్చిన చోఁ దరువాత జూచుకొనవచ్చును గదా.

మాధ—ఇఁకఁ జూచుకొనున దేమున్నది. వాళ్ళు చెప్పిన ప్రకారము మనము వొప్పుకొంటిమేని నెమ్మదిగా యాస్తియంతయు వారిపర ము గావలసినదే. మనము తీర్చివావగలమా ! అసలుకంటె వడ్డీ అధికమైపోతుంది.

దుర్గాం—అట్లయిన జేయవలసిన పని యేమున్నది ?

మాధ—నాకుఁదోఁచినది పాల మమ్ముటయే మంచిదని. అంతకంటె నుత్తమమైన కార్యము మఱియొకటి కనఁబడ లేదు.

దుర్గాం—అయినను నింతతొందర యిప్పుడేల ? కొంచెము వడ్డికి మఱి యెక్కడనైన దొరుకుతుందేమో ఆలోచించరాదా !

మాధ—తొందరయేమని అడుగుచుంటివా ? శరభయ్యగారు, ఇయ్యఁ దలఁచిన కట్నముసొమ్ము- పదిహేను రోజులు వివాహమునకుఁ బూర్వమే పంపవలయునని కబురు పంపినారు.

దుర్గాం—ఇది యెక్కడివింత! వివాహసమయమున ముచ్చటగా నలుగురు చూచుచుండఁగా నియ్యవలసినది గదా.

మాధ—అట్లుగాదట- వారికి సొమ్ము ముందుగనే కావలయునట.

దుర్గాం—బాగానేవున్నది. ఈవింత యెక్కడను జూడలేదు- ఆహా ! కాలమెట్లున్నది అట్లయిన పాలమమ్మి సొమ్ము శరభయ్యగారికి ముందుగా బోయవలసిన దేనా ?

మాధ—మాటలాడకుండ-

దుర్గాం—అయ్యో ! ఉన్నపాలము కొంచెము నమ్మకొని పిదప మనము చేయవలసిన పనియేమున్నది? జీవయాత్ర గడుపుటకు మనకు మార్గ మేమియున్నది ? మన మేమైపోవుదుము.

మాధ—వెఱ్ఱిదానా ! నీప్రశ్నకు నేనేమని ప్రత్యుత్తరమియ్యఁగలను.

సీ. తల్లిదండ్రులు లేక ॥ తగిన సాయము లేక
వారివీరిని జేరు ॥ వారు లేరె
కూడుగుడ్డలు లేక ॥ ఘోషపెట్టుచును నూ
రూరఁ జరించెడు ॥ వారు లేరె
ఉండఁ గొంపయు లేక ॥ పండమంచము లేక
వనములందు వసించు ॥ వారు లేరె

కళ్ళు కాళ్ళును లేక ♪ కటకటా దురవస్థ
వచ్చెననుచుఁ గుందు ♪ వారు లేరె

గీ. వీరి నెల్లర నెవ్వాఁడు ♪ పృథ్విలోన
మనుచుచుండు; మనలనట్టి ♪ మాన్యుఁడే కృ
పామయుండౌచు రక్షించి ♪ పరగఁగలఁడు
చింతయేటికి దీనికి ♪ స్వాంతమందు.

తే. గీ. రాతిలోపలఁ గప్పకు ♪ రక్షకుండె
వండు; పేడలోఁ బురుగుఁ గా ♪ పాడు నెవఁడు
బృథ్విరుహముల నెల్లను ♪ బెంచు నెవఁడు
వాఁడె మనల రక్షించును ♪ వనజనేత్రి.

రమ్మ. భోజనమునకు వేళయైనది. (నిష్క్రమింతురు.)



రంగము:—[పేరయశాస్త్రిగారు ప్రవేశము.]

పేర—[ప్రవేశించి తనలో] ఇదే సమయము. శరభయ్యగారికి కల్నము సొమ్ముక్రింద యిచ్చుటకు మాధవరావు పంతులుగారి దగ్గిఱ సొమ్ము లేకపోవుటచేత తాకట్టు పెట్టుట కన్న యేదో తీరునపొలము అమ్మ దలచుకొని తత్ప్రయత్నము చెయ్యమని నాకు చెప్పినారు. పొలం చాలామంచిదనియే వినియున్నాను. నెమ్మదిగా ఈసమయంలో ఈపొలం మా మేనల్లుడుకొంటాడని చెప్పి వాడికి ఫయిసలు చేయించి నెమ్మదిగా నాపేర ట్రాన్సుఫర్ చేయించుకొంటాను. వెధవ రొఖముకన్న పొలంపడివుంటే కదిపేవాడు లేడు. (ఎదుటఁజూచి) అదుగో, మాధవరావుపంతులుగారు ఇల్లే వచ్చుచున్నారు.

మాధ—[ప్రవేశించి] పేరయ్యశాస్త్రిగారా! రండి. రండి. మీకోసమే యెదురు చూస్తున్నాను.

పేర—నేను వస్తానని చెప్పితిరిగా మాట తేడావుంటుందా. కాకపోతే

యేదో ఒకవ్యాపారం నెత్తినబెట్టుకొని వెళ్ళినాముగనుక అను కొన్నపైనుకు ఒకనిముషము హెచ్చుతగ్గుగా రాకమానుతానా!

మాధ—మనకార్య మేమిచేసుకొని వచ్చినారు.

పేర—అబ్బబ్బా! చెప్పతే నమ్ముతారో లేదోగాని, కాళ్ళన్నీ నొప్పు లుపెట్టేటట్లు తిరిగినాను. కుక్కలాగున ఎక్కేసున్నును దిగేసున్నా ము. ఏమయితేనేమి! కార్యమయితే సంతోషముండును.

మాధ—ఇంతకును గార్యముకాలేదా!

పేర—మనమెఱిగివున్న వెధవలందఱూ బెట్టుచేసినవాళ్ళే. పదిసారులు బ్రతిమాలితే మఱి చెట్టుకొమ్మ యెక్కుతారని వ్రాసుకొన్నాను.

మాధ—ఊరుకొంటే ఏలాగు. శరభయ్యగారు కబురుపంపించినారు.

పేర—సరి. మీకూ కబురుపంపిచారూ! నేనిప్పుడు వచ్చేటప్పుడు కనిపించి, త్వరగా పైకం పంపించమని మాధవరావుగారితో చెప్పు మని నాకును చెప్పినారు. ఆయన మహా అసాధ్యుడు. ఏవేళ కేబుద్ధిపుడుతుందో- డబ్బుదగ్గిఱ నిర్మోహమాటం.

మాధ—అయితే ఇప్పుడేమి చేయుదము.

పేర—ఒకసంగతి చేస్తే బాగావుంటుందేమో అని తోస్తున్నది. మా మేనల్లుడు-మీరెఱుగరేమో విస్సావఝుల రామనాథం- బరంపరం నుంచి యిక్కడకువచ్చినాడు. అతనితో ఈవిషయం మాట్లాడి నాను. అతడు కొందామని వుద్దేశం కనపఱచినాడు. ఏదోమొస్తరు గా అతనితో ఫయిసలుచేస్తే బాగుంటుంది.

మాధ—సరే. ఇక ఆలస్యమెందుకు? అందులో మీమేనల్లుడే కనుక- చెప్పనక్కఱ లేదు

పేర—తమ రాహాలం సంబంధమైన కాగితములు సిద్ధంచేసి వుంచండి. నేను అతన్ని యిక్కడకే తీసికొనివస్తాను.

మాధ—మంచిది. త్వరగారావలెను రండి. (నిష్క్రమింతురు.)

రంగము:—[గదియందు సుశీల ప్రవేశము.]

సుశీ—అక్కటా! కాలచక్ర మెట్లు తిరుగుచున్నది.

తే. గీ. పడఁతులకుఁ బెండ్లి సేయంగ వలయునన్న
బెండ్లికొడుకులకు ధన మర్పింప వలసె
ఆ ధనంబునకై యున్న యాస్తియెల్ల
విక్రయము జేసి యక్కటా వృద్ధియాను.

ఇంత చదివితిని. నే నిట్టి సంబంధమున కంగీరింప వలసిన దేనా! ధన మిచ్చి తెచ్చుకొన్న వరుని వివాహమాడుట కంగీకరింప వలదని నాకు ధర్మదేవత ప్రబోధించుచున్నది. నే నీవిషయము మనస్సులోఁ దాఁచు కొన్నందువలనఁ బ్రయోజన మేమున్నది? నాతల్లిదండ్రులకుఁ జెప్పి వారి చిత్తములఁ ద్రిప్పఁ బ్రయత్నించెదఁగాక. అంతియేగాక, కొని తెచ్చుకొన్న వరుఁడా విద్యావతి నగు నాకు విభుఁ డగుట!

దుర్గాం—(ప్రవేశించి) అమ్మాయీ! సుశీలా! పండుకొని యుంటివేమి? ఏమైన బద్ధకముగా నున్నదా?

సుశీ—బద్ధక మేమియు లేదు.

దుర్గాం—అట్లయినఁ జలిదియన్నమునకైన రాకుండఁ బరుంటివేమి?

సుశీ—నా యాఁకలి దప్పు లడఁగిపోయినవి.

దుర్గాం—ఎందుచేత?

సుశీ—ఈ పెండ్లి దలపెట్టుకొనుటచేత.

దుర్గాం—అట్లు పలుకుచుంటివేమి? పెండ్లియన్న పిల్లలందఱును సంతోషింతురు. నీవట్లుగాక విచారముగ నుంటివి. పెండ్లికుమారుని యందు నీ కిష్టము లేదా?

సుశీ—ఈ వివాహమునందే నాబుద్ధి ప్రవేశించుట లేదు. ఇట్టి పెండ్లికి సమ్మతింప వలదని నాయంతరాత్మ బోధించుచున్నది.

తే. గీ. కులము శీలంబు విద్యయుఁ  గలితరూప
సంపదయునొప్పు మీయాత్మజాత కిట్లు
విత్తమును సంగి వరుఁ దెచ్చి  పెట్టుఁగుచుఁ
గట్టబెట్టుదురె యఘంబు  గాదె యిద్ది.

ఇట్టి నీచకార్యము నిశ్చయముగాఁ బాపమని నేను చెప్ప సాహసించుచున్నాను. పాపముసంగతి యటుండుము. జ్ఞానవంతుల మగు మన మిట్టికార్యముఁ జేసితిమేని జగము పరిహసింపదా?

దుర్గా—నీవు చెప్పఁదలఁచినమాట యిదియేకదా! దీనికంత విచారింప నవసరము లేదు. ఇది మన యింటనే వెలయలేదు.

తే. గీ. ధనముగల్గిన లేకున్నఁ  దనయ కెట్లొ
వరుని గూర్పఁగఁ దమకున్న  భాగ్యమెల్ల
వదలుచుండిరి తెలుంగునఁ  బట్టి నేఁడు
క్రొత్తకాదుసుమీ మన  కొంపయందు.

పిల్లవానిని మాటలాడుకొని యింతని సొమ్మిచ్చుటకూడ నిప్పుడాచారమైనది.

సుశీ—అంతటి ఆచారము లో మన కేల? మనము వివేకులము. సర్వము తెలిసినవారము. ఇట్టి యకార్యములు చేయువారందఱును జ్ఞానహీనులని నేను గట్టిగఁ జెప్పఁగలను. ఒకరు చేసినారుకదాయని మనముగూడఁ జేయుట మంచిదా? లోకము వారి నెట్లునిందించునో యట్లే మనలనుగూడ నిందింపదా? అందఱును వరశుల్క మడుగుచుండిరి. అందుచేత నందఱును నిచ్చుచుండిరని పలుకుచుంటివి. ఇదెక్కడిమాట!

తే. గీ. పాపమున కొకింతయైన  భయము లేక
యడుగుచుండిరి వరశుల్క  మకట వారు

కోరినంతనె యిచ్చుచు న్నారు నీరు
దానికిని మన యొప్పుకో దగును తల్లి.

దుర్గా—ఒప్పుకోక చేయఁదగినపని యేమియు లేదు.

తే. గీ. తెచ్చుకొన్నట్టి ఋణమును దీర్చుకంటె
పాలకులు విధియించెడు పన్నుకంటె
పెండ్లికొడుకుల కట్నముల్ పృథ్వియందు
ముఖ్యమై యొప్పుచున్నవి పోలఁతి కంటె!

ఇది తప్పనిసరి.

సుశీ—అమ్మా! ఇది వెఱ్ఱిమార్గ. సత్కుల జాతులును, సుగుణ శీలురును నగు వారెందఱో కలరు. అందులో నిర్ధను లనేకు లుందురు. శుల్కరహితముగ వారి కొసగిన బాగుండదా?

దుర్గా—నీవు చెప్పినమాట నిశ్చయమే గాని, యీ కాలములో మగ రూపమునను న్న ప్రాతిబొమ్మయైనను సరే- దగ్గఱకుఁ బోయి పెండ్లి సంగతి యెత్తినయంతనే, తే డబ్బు ఎంత ఇచ్చెదవు, మాపిల్లను జేసికొనుట కని యడుగుచున్నారు. అమ్మా ఇవి యన్నియు లాభము లేనిమాటలు. ఈ కాలములోఁ గట్నము పుచ్చుకొని పెండ్లి జేసికొనుమని మగవానికి కష్టపడియో లేక ఉన్నయాస్తి అమ్ముకొనియో, మగనినిదెచ్చి ఆడపిల్లలకుఁ బెండ్లి సేయుమని తల్లిదండ్రులకు మొగములమీద వ్రాసి. బ్రహ్మ సృష్టించుచున్నాడు. తెలిసినదా?

సుశీ—సృష్టివైచిత్ర్య మాతయు నట్లే యున్నదా! అట్లయిన,

తే. గీ. ఇట్టిపెండ్లాసి భువిలోన నెగడుకన్నఁ
బెండ్లి యేమాని యోగినీ వేషమూని
విష్ణుభజనంబు సల్పుచు వెలుగుచుంట
సద్యశముఁగూర్చుగాదె యో జనని నాకు.

అన్నిటికంటె నాకది బాగుగానున్నది. నేనిట్టి వివాహమునకు సమ్మతింపను.

దుర్గాం—అమ్మా! నీవట్లుపలికెదవుగాని, వివాహముగాకుండ నాఁడపిల్ల యింటనున్నచో, నెంతయపనింద. తల్లిదండ్రులు తలయెత్తి మెలఁగఁగలరా? మీ అమ్మాయికి వివాహమేలకాలేదని యొక రడుగుదురు భర్తయెవ్వరని యొకరును, కాపురమునకు వెళ్ళినదాయని యొకరును ని ట్లనేకవిధముల నడుగుదురు. ఇందు కేమి ప్రత్యుత్తర మీయఁగలము. (ఎదుటఁజూచి) అరుగో, మీనాన్నగారు వచ్చుచున్నారు.

మాధ—(ప్రవేశించి) ఒసే! ఏమిచేయుచున్నావు?

దుర్గాం—ఏమున్నది చేయుటకు? అమ్మాయి మనస్సెంతయు నదియొక మోస్తరుగా నున్నది. ఇంతకూ మీరువెళ్ళినపని యైనదా?

మాధ—అమ్మదలఁచుకొని, దస్తావేజువ్రాసి రిజస్టరీ ఆఫీసుకు వెళ్ళిన తరువాత, కాకుండా వుంటుందా! (ఇంచుక యూరకుండి) అమ్మాయిమనస్సు బాగులేదని చెప్పినావు. అదేమిటి?

దుర్గాం—అమ్మాయి కీవివాహ మిష్టములేదఁట. ఇఁక చేయవలసినపని నాకుఁ దోచకయున్నది.

మాధ—ఎందుచేత, పెండ్లికొడుకు రూపవంతుఁడు కాఁడనియా?

దుర్గాం—అదికాదు. శుల్కము గ్రహించువానిని బెండ్లాడనని చెప్పుచున్నది. మొదట మీకుఁగల్గిన పట్టుదలయే యిది యిప్పుడు వహించినది.

మాధ—అట్టి యభిప్రాయము నాబిడ్డకుఁగూడఁ గలిగినదా? అందుకు సంతోషమేగాని, మాదీక్ష నెగ్గనందుకు విచారము. అమ్మా! సుశీలా! మీ అమ్మతో శుల్కము గ్రహించువానిని గైకొననని యా పలుకుచుంటివి?

సుశీ—నాన్నగారూ! అమ్మతోడనేకాదు, మీతోఁగూడ నిప్పుడామాటయే మరలఁ బలుక సాహసించుచున్నాను. తండ్రీ! నాప్రార్థనము

నీవు సంపూర్తిగ వినుము.

తే. గీ. ఆఁడబిడ్డ నాటఁగద ద్రవ్యంబు నిచ్చి
నాథునిం గూర్పఁగా నెంచి నారు మీరు
పుత్రుఁడేయని భావించి పోలుపుమీర
గృహమునం దుంచుకొను డయ్య కీర్తివచ్చు.

దీనివలన మీకు నపకీర్తిరాదు. ఏలయనినఁ శుల్కము గ్రహించిన వరుని గైకొనుటకు సమ్మతింపక యిట్లు చేసినదని లోకమున కొక పాఠముగ నుండును.

మాధ — అమ్మా! ఆఁడది యెప్పుడును పరులసొమ్మేగాని తల్లిదండ్రుల యింట నుండుట ధర్మముగాదు. తగిన వరుని దెచ్చు భారము తల్లిదండ్రులది. ఈవిషయమునఁ దండ్రి యేమాత్ర మజాగరూకుఁడైయున్నను లోకనిందకుఁ బాల్పడును.

సుశీ —

చ. ధనమె ప్రధానవస్తువుగఁ దద్దయు నెంచిన పాపిచేతిలో
ఘనముగ సూత్రరాజమును గట్టఁగఁ జేయుటకన్న, వేశ్యతోఁ
దనకుచుదానె కంఠమునఁ ద్రాడుబిగించుక సాహసంబునన్
దనువుదొలంగఁజూచు టది ధారుణియందు యశంబుఁదెచ్చుగా.

మాధ — ఆహా! ఎంతమాటాడితివి. నీపాటిజ్ఞానము మగవారమైన మాకుఁగూడ లేదుకదా. అమ్మా! ఈ వరశుల్కము నాపుటకు నెంతయో ప్రయత్నించితిని. ఎన్నియో యుపన్యాసము లిచ్చితిని. పత్రికలయందు ఘోషపెట్టితిని. మాపిల్లల కట్టివివాహములు చేయనని దీక్షవహించితిని. అంతయువ్యర్థమైనది. నామాటలు వినినవా రెవ్వరును గనఁబడలేదు. తుదకు నాదీక్షకుఁగూడ భంగమైనది. అందఱితోఁబాటు నేనుగూడ వరశుల్క మిచ్చి వివాహము సేయుటకు సిద్ధపడితిని. మన ప్రయత్నమువలన నిఁక లాభములేదు.

తే. గీ. లోకమంతయు బిడ్డ! యల్లుఁడై నేమి
సేయఁగలవాఁడ శుల్కంబు చెల్లకున్న
భర్తరాఁబోదు పడఁతికి భర్తరాక
యున్న, యపనిందపైఁబడు నద్వయంను.

సుశీ—నాన్నగారూ! ఇన్నిమాటలతోఁ బనియేమున్నది. ఇట్టివివాహమునకు నాచిత్తము సమ్మతించుటలేదు. నేను మీకునిజమైన పుత్రికనైతినేని, నామీఁద మీకు నిష్కళంకమైన యనురాగముండెనేని, యీవివాహ ప్రయత్నము మానుడు. కట్నము స్వీకరింపకుండ వరుడు రాకున్నచో, భగవన్నామస్మరణము జేసికొనుచు గృహమునందే యుందును. మీరు వివాహప్రయత్నము మానరేని— (ఏడ్చును).

మాధ—అమ్మా! నీవు చిన్నదానవు. ఏమీ తెలియదు.

దుర్గాం—బాగానేవున్నది ఏమవు. పదపద. (సుశీలతో నిష్క్రమించును.)

పేరయ్యశాస్త్రి—(ప్రవేశించి) అదేమిటి పెండ్లికూతురు ఏడుస్తూవుందేమిటి.

మాధ—ఏం చెప్పమంటారు. వరునకు శుల్క మిచ్చిచేసిన వివాహమునకు సమ్మతింపదఁట. నాకేమీ తోచకుండా వున్నది. ఈవివాహం కోసం ఎంతో ప్రయత్నంచేసి డబ్బుతెచ్చినాము.

పేర—పంతులుగారూ! మీరు ఈలాటి అనుమానములు పెట్టుకోకండి. ఆడవాళ్ళని అడిగి ఏవ్యాపారం చేసినా సాగదు. ఒకవేళ చిన్నతనంచేత పిల్ల అల్లాగన్నా కట్నం పంపేశామంటే ఇహ మరి మాటాడదు.

మాధ—అయితే కట్నంరూపాయిలు తీసికొనివెళ్ళి శరభయ్యగారికిస్తారా యేమిటి?

పేర—ఆలస్య మెందుఁలకు, పట్టుకొనివెళ్ళి రసీదు తీసుకొనివస్తాను.

మాధ—అలాగయితే, ఇవిగో. (రూపాయలిచ్చి లెఖపెట్టుకొనండి)

పేర—ఇవన్నీనోట్లే, శరభయ్యగారితో చిక్కు. రూపాయలు కావాలంటాడు. ఇవన్నీ రూపాయలక్రింద మార్చుడానికి వట్టం క్రింద ఐదు రూపాయలు అవుతుంది. పోనియ్యండి బాబూ! వెధవ అయిదు రూపాయలు పోతేనేమి, మార్చి రూపాయలే పట్టుకొని వెళ్ళి యిస్తాను.

మాధ—అల్లాగే కానియ్యండి. అందులో పోయిందేవిటి? ఇవిగో అయిదురూపాయిలు. ఇచ్చి మీరిక్కడే వెళ్ళి యిచ్చివెయ్యండి. నేను భోజనమునకు లేస్తాను. (నిష్క్రమించును).

పేర—(తనలో, పిల్లమాటవిని ఈయన వెనక్కి తీస్తాడేమో అనుకొన్నాను. ఫరవాలేదు. ఇదంతా ఆడవాళ్ళకు చదువురావడంచేత. ఆడవాళ్ళకు చదువురావాలని చెప్పేవాళ్ళ డొక్కబద్దలుచెయ్యాలి. నాకిమీవను ఎక్కడపోతుఁదో అనిభయఁపడ్డాను. ఇహఁఫరవాలేదు.

(నిష్క్రమించును).



రంగము:—గదియందు.

[సుశీల విచారముతోఁ బ్రవేశించును.]

సుశీ—(తనలో) పేరయ్యశాస్త్రిగారి చేతికిచ్చి శరభయ్యగారికి గట్నము పైకము బంపించి రసీదుకూడ తెప్పించినారఁట. ఇఁకఁ జేయవలసిన దేమున్నది!

చ. తలఁపు నెఱుంగఁజేసి యిది శ్రీ ధర్మముగాదు సుడీ యటంచు నే
బలువిధముల్ వచించితిని శ్రీ ప్రార్థనజేసితిఁ గాళ్ళుపట్టి నా
పలుకులఁ జేర్పలేదు చెవి శ్రీ భవ్యగుణాఢ్యులు తల్లిదండ్రు లీ
యులమట కేమిసేతు నక శ్రీ టా! కృశఁజూడఁడు దైవమైననుక్:
ఆడజన్మము నిరర్థకమైనది.

తే. గీ. విత్త మర్పింపకుండినఁ బెండ్లి కాదు
గౌరవం బనుమాటయుఁ గానరాదు
భూరిస్వాతంత్ర్యబుద్ధి యే మూలలేదు
కాంత జన్మంబు కాల్పనా క్ష్మాతలమున.

ఓ దైవమా! ఎవ్వరికిని నీ యాఁడుజన్మ ప్రసాదింపవలదు. ఇది బహు అవమానకరమైనది. (ఇంచుకయాఁగకుండి) ఇప్పుడు నే నేమి సేయుదును! ఈసంబంధమునకు సమ్మతింపవలసినదేనా! శుల్కము గ్రహించిన వానిచేత పుస్తెఁ గట్టించుకొని నలుగురితోఁ బాటు యూరకొనవలసినదేనా! లేక ఈకార్యమును నిరాకరించి తల్లిదండ్రుల చిత్తములకుఁ గష్టము లేకుండ లోకమునకు నిట్టి యకార్యము వలదని యేదైనఁ బాఠము బోధింపవలయునా! గట్టిగ నిట్టికార్యము వలదని మూర్ఖపుపట్టు పట్టి కూర్చుంటినేని తల్లిదండ్రులను గష్టపెట్టినదాననగుదును ఏమి చేయుటకును దోఁచకున్నది.

తే. గీ. వలదు పెండిలి యన్న మావారిమాట
కడ్డుజెప్పిన నవిధేయ నగుదు, సమ్మ
తింత మనిన పాపము వచ్చుఁ దెగువఁ బూని
ప్రాణి విడచుటే మంచిమార్గమని తోఁచు.

చారు—(తొందరగా వార్తాపత్రికతోఁ బ్రవేశించి) అక్కా! వరశుల్కదుర్న్యయ మనేకకొంపలార్పుచున్నది. ఎవరో కలకత్తాలో నొక చిన్నది కడుసౌందర్యవతియఁట, విద్యావతియట, తండ్రియామెకు వివాహము సేయఁ బ్రయత్నింపగాఁ బ్రతివారును కట్నమడిగినవారే యఁట, అత, డంతధనము కలిగినవాఁడు కాకపోవుటచేఁ దనకున్న భూమిని విక్రయించి కట్నముగా నొసంగఁదలంచుచుండ నదిగని కుమార్తె తనవలనఁగదా తండ్రి కట్టికష్ట మొందుచున్నదని బలవన్మరణము నందెనఁట.

సుశీ—ఆహా! ఆమె యెవ్వరో శీలవతియే. వరశుల్కవివాహ మిష్ట ములేకపోవుట యొకటి; తనమూలమునఁ దల్లిదండ్రులు దరిద్రావస్థలో మునుఁగుదురని యొకటి; ఈ రెండును నామెతలంచియే ప్రాణము బాసియుండును. ఆ యువతి చేసిన పనిమాత్ర మతిశ్లాఘ్యమైనది. చావున కిన్నిచావులున్నవా!

చారు—ఇట్టివి కన్నులారఁ గాంచుచుండియు మనదేశమువారు వరశుల్కస్వీకారము కట్టిపెట్టకయుండిరికదా!

సుశీ—ఇట్టివి నాలుగైదు జరిగినగాని మనవారికి శ్రద్ధయుండదు.

చారు—అందఱికిని నట్టిసాహసముండునా?

సుశీ—అట్టిసాహస మున్నప్పుడే ప్రతివిషయమునందున జయము కలుగును.

చారు—ఈమాటలకేమి! ఆఁడవాళ్లుపుట్టడం, తల్లిదండ్రులఆస్తి తగలేయించి పెండ్లిచేసికొనుటకే. పద భోజనమునకు.

సుశీ—నాన్నగారు రావద్దా!

చారు—నాన్నగారు భోజనము చేసియే వెళ్ళినారు.

సుశీ—చారుమతీ! నాకీపూట మొదుకోగాని యాఁకలిలేదు. అదియునుగాక పైత్యప్రాబల్యముగనున్నది. కడుపులోఁ ద్రిప్పుచున్నది. నీవుపోయి భోజనముచేయుము. నేను పరుండెదను. అమ్మయడిగిన నిట్లని చెప్పుము. నన్ను మేల్కొలుపవద్దు.

చారు—సరే (నిష్క్రమించును).

సుశీ—అక్కటా! మాతండ్రి తనకున్న పొలముకు విక్రయించికదా, అల్లునకుఁ గట్నము చెల్లించిరి. ఉన్నయాస్తిలో సగము నాకొఱకు వినియోగింపఁబడుచున్నది. తక్కినది నాచెల్లెలు వివాహమునకగును. ఆపైన నాతల్లిదండ్రులు ముష్టిచెంబు పుచ్చుకొని యింటింటికి అన్నమో రామచంద్రాయని తిరుగవలసినదే కదా! ఇదియం

తయు నామూలమున నేకదా! కలకత్తాయందలి యువతి వరశుల్క వివాహమున కిష్టము లేక నేకదా ప్రాణములు పరిత్యజించి యశ మందినది నేనుగూడ నామె మార్గము నే యనుసరించెదఁగాక! ఓసుశీలా! నీవు శీలవతివే యైతివేని వరశుల్క వివాహమునకు సమ్మతింపక జీవములఁదొఱఁగి కీర్తినందుము. నీవిట్టి కార్యము జేసితి వేని మానవతివనిపించుకొందువు. అంతియేగాని శుల్కము గైకొను వానిచేత మంగళసూత్రము గట్టించుకొని దుష్కీర్తినందవలదు. నీకు దేహము నిత్యముగాదు. బ్రహ్మ సృష్టించి నప్పుడే మృత్యువు గూడ నీమొగంబున వ్రాసిపెట్టినాడు. అట్టియెడ నీవు సంశయం బున బొందఁబనిలేదు. సమస్తమగు సంశయంబులను విడిచి లోకమునకు బుద్ధివచ్చునట్లు ప్రాణములఁ బరిత్యజింపుము. (ఇంచుక యూరకుండి) ఆత్మహత్యాపాప మని పెద్దలు చెప్పుదురే. నే నిట్టి హేయమగు కార్య మనుష్ఠించితి నేని నాజన్మ తిరుగ విముక్తిని బొందనటువంటి ఘోరనరక కూపమునఁ బడు నేమో! దుష్కీర్తివచ్చు నేమో! కావున నేనిట్టి ఘోరకార్యము జేయుటకు నాహ సింపవచ్చునా? (ఆలోచించి) ఇట్టిసంశయంబులతోఁ గూర్చున్నచో నేదియు సాగదు. నేనిప్పుడు చేయఁబోవు పని మానము కాపాడు కొనుటకుగదా, ధనముస్వీకరించి నన్నుఁగొను వానిచేతిలోఁ బడ కుండుటకుగదా! ఎందఱందఱు క్షత్రియాంగనలు వెలమకాంతలు మానము గాపాడుకొనుటకై తమశరీరములను దృణప్రాయములుగ భావించి పవిత్రమగు యగ్నిహోత్రున కప్పగించి శాశ్వతకీర్తి నందిరి. కావున నేనును వారిమార్గము ననుసరించుచున్నప్పుడు నాకుమాత్రము పాపమేల సంభవించును. అవమానమునుండి తప్పించుకొనుటకే సుశీల యిట్టికార్యము జేసినదని నాకు గౌరవ మేవచ్చును. నే నీకార్యము జేసితినేని నాతల్లిదండ్రులు ధననష్టము

నకుఁ బాత్రులుగాక యుందురు. నా కింతకన్న కావలసిన దేమున్నది. నేనొక లేఖము వ్రాసి ఈబల్లపై నుంచెదఁగాక. (ఉత్తరము వ్రాసి బల్లపై నుంచి) ఓగృహమా! నిన్ను విడిచిపోవుచున్నాను. ఓతల్పమా! నీకును నాకును ఋణము తీరినది. ఓబొమ్మలారా! ప్రతిసంవత్సరమును మిమ్ము నలంకరించు ఆనందము నాకు నేటితోఁ దీరిపోయినది. ఇఁక మిమ్ము మాచెల్లెలు జూచుచుండును. (గడియారము గంటలువిని) అదిగో పండ్రెండుగంట లయినది. ఇఁక నే నాలసింపరాదు.

[తెర లేచును—పెరడు, బావియునుండును]

(నెమ్మదిగాఁ దలుపుతీసికొని పెరటిలోని కరిగి) ఈపెరటియందలి పాదులన్నియు నేనును నాచెల్లెలును పెట్టితిమి. వీనిని విడిచిపోవుచుంటిని. ఓపాదులారా! నాహస్తములచే నీరుబోయఁబడి వృద్ధినందిన మీరు నాతల్లిదండ్రులకుఁ గొఱఁత లేకుండ కూరలనిండు. (బావిని సమీపించి తొంగిచూచి) ఓ! గంగాభవానీ! నన్ను రమ్మనుమని పిలుచుచుంటివా! ఇదిగో వచ్చుచున్నాను. ఓతల్లీ!

సీ నవమాసంబులు మోసి మోసి కని నా కై నాకష్టముల్ గాంచి శై
శవజన్మోత్కట బాధలన్ సమసి మో కై కుంభీవిహారించి పెం
చి వినోదించెడు నీకు నేను ఋణమున్ కై దీర్పంగలేనైతి స
ద్భవుకప్రీతి నొసంగు నాదు ప్రణతుల్ కై దల్లీ! కృపన్ గొమ్మ నే.

అమ్మా! నన్నుఁ గంటివి. నాముద్దుముచ్చటలఁ జూచితివి. అట్టి నిన్ను విడనాడి పోవుచున్నాను నన్నుఁగూర్చి నీవు దుఃఖింపకుము. నేను ధరించు వసనంబులఁ గాంచి చింతఁ జేర్పవలదు. సుశీలయను కుమార్తెను నీవు గననే లేదనుకొనుము. తండ్రీ! పుత్రులు లేకపోయినను సుశీలయుఁ జారుమతియు బుత్రులేయని తలంచి సంతోషముందుచుంటివి. నాయనా! నిన్ను విడిచిపోవుచున్నాను. దుర్భరగర్భశోకమున నీవుకృశింప

పలదు. ఓభరతమాతా! మహోన్నతశిఖరము నధిష్ఠించి నీవు సుఖంచిన నీపూర్వవైభవపు దినములు స్మరించిన నాకుఁ గంటనీరువచ్చును. ధర్మసంధులగు దుష్యంతుఁడును, యుధిష్ఠిరుఁడు మొదలగు నృపాలురచేఁ బరిపాలింపబడినప్పుడెట్టిసౌఖ్యమును బొందితివో కదా? జననీ! నీగర్భస్థసంతానమిప్పుడెట్టి క్రూరకార్యములఁ జేయుచుండెనో కంటివా! ఓరాజ్యపాలకులారా! మీరు నిరంకుశశాసనులరు. ఎవరేమనుకొన్నను మీకావంతయు భయములేదు. ప్రతివిషయమునఁ బన్నులువిధించు మీరు వరశుల్కము గ్రహింపఁగూడదను శాసనమేలగావింపరు? దీని వలన మీకావంతయు నష్టములేదే! ఓసంఘసంస్కర్తలారా! సంఘసంస్కర్తలమని పేరుబెట్టుకొని యుపన్యాసములకు బయలుదేరుదురు గాని మీరుచెప్పెడియుపన్యాసముల ననుసరించి మీరుప్రవర్తింపరేల? విధవా వివాహములు పనికివచ్చునని వేదికలపైనెక్కి గొంతుకపగులు నట్లుఅఱచుటయేగాని, మీయింటనుండు వితంతుకన్నెకు వివాహము నేల కావింపరు? ఎందుకీయుపన్యాసములు! మీరా సంస్కర్తలు మీరా దేశముద్ధరించువారు! దేశమునకు సేవజేయువారు! మీకిది యంతయు నక్కఱలేదు మీసంఘసంస్కరణమంతయుఁ బ్రొద్దుననేలేచి, స్వయముగా క్షౌరముచేసికొని, స్నానమైనజేసికొనకుండ కాఫీహోటలునకు పరుగెత్తుటయందును, కారాకిల్లీ నమలుటయందును, ఫ్రెషు మోటారురూములయందు బ్రాందీత్రాగుటయందును గనబడుచున్నది. దేశదుస్థితిని విచారింపకయున్నారు. ఇఁకనైనమేల్కొనుడు. వరశుల్కవివాహములనడ్డుడు. ఈవరశుల్కవివాహములమూలమున నెందఱెందఱుతల్లిదండ్రులు గోలపెట్టుచున్నారు. ఎన్నికుటుంబములు తమకున్నయాస్తిని గోలుపోయి తిండిలేక మలమలమాడుచున్నారు. ఈవిషయము మీరు బాగుగాఁజూచితిరా? యువతులకిట్టి యవమానము గలుగుట మీరు చూచి యూరకుందురా? స్త్రీని వివాహమాడుటకుఁ బన్నుచెల్లింప

వలయునా! ఓ మగబిడ్డలగన్నతండ్రులారా! మీకేఁసిగ్గులేదు. అబ్బాయికి పిల్లనిత్తుమని యడుగవచ్చినయంతనే శుల్కమెంత యిచ్చెదరని యడుగుదురా! చచ్చునప్పు డీసొమ్మంతయు గట్టుకొనిపోవుదురా? మీ రెప్పుడును మగబిడ్డలనే కనుచుందురా? ఆఁడుబిడ్డలు గలిగినప్పుడు మీకీయవస్థ రాదా? మీబిడ్డలయవస్థ యొకటియు, ఇతరులబిడ్డల యవస్థ యింకొకటియునా? ఇప్పుడైన సిగ్గుదెచ్చుకొని యీదుర్బుద్ధిని మాని దేశము నుద్ధరింపుఁడు. లేకున్న మీరు ఘోరనరకంబునఁ బడఁగలరు. చెల్లెలా! చారుమతీ! నన్ను మఱచిపొమ్ము. నీవుఁగూడ వరశుల్కవివాహనిషేధమునకై యత్నించి యశమందుము. (ఇంచుక యూరకుండి) అదుగో! తలుపుచప్పుడగుచున్నట్లున్నది. నేను తొందరపడవలయును. ఒక్కసారి హరినామస్మరణ జేసికొని యిందుఁ బ్రవేశింపెదఁగాక! (కన్నులుమూసి స్మరణ నభినయించి) ఓకూపస్థజలమా! నన్ను నీలోనికిఁ జేర్చుకొమ్ము. హా పరమేశ్వరా. (బావిలోఁ బడును)

ఇది తృతీయాంకము.





శ్రీరస్తు.

# వరవిక్రయము.

## చతుర్థాంకము

రంగము:—శరభయ్యగారి వ్యాపారపుగది.

[శరభయ్యగారు ప్రవేశము]

శర—(తనలో) అన్నన్నా! ఎంతపనిజరిగెను! ఆ చచ్చేముండ కాస్త పెళ్ళి అయినతరువాత చావకుండా, యిప్పుడేచచ్చినదే. ఆ కాస్త అయిపోయినచో నాకు పంపిన నాలుగు వేలు హాయిగ దక్కియుండు నే.. నాకదిచచ్చినదని చింతలేదు గాని, నాలుగువేలు మరల వారి కెక్కడ నీయవలయునో యనిచింత. (ఇంచుకయూరకుండి) నిన్నటి దినమున నయ్యంకివారిచిన్నవాడు ఏదోకొంతఋణము కావలయు నని వచ్చిపోయినాడు. ఈదినమున వచ్చెదనని చెప్పి రాలేదు. వీడికి మైనార్టీ వెళ్ళవచ్చినది తండ్రిచాటువాడు. ఏ నాలుగువందలో చేతి లోబెట్టి నాలుగువేలకు నోటువ్రాయించుకొంటాను. డబ్బుయెక్క డికిపోదు. కావలసినంత ఆస్తివుంది. వీడి తండ్రి పెద్దవాడైనాడు. ఎప్పుడో కాస్త ప్రాణం గుటుక్కుమంటుంది.

నరసయ్య—(ప్రవేశించి) బాబూ! వర్షాకాలమువచ్చినది. గుడ్డలకి చచ్చిపోతున్నాను. జీతండబ్బులు దయచేస్తే బజారుకుపోయి మొద్దుగుడ్డలు రెండు కొనుక్కుంటాను.

శార—గుడ్డలు గుడ్డలు అని యేక కలవరిస్తున్నావేమిటి. ఈజీతం నాదగ్గఱ వుండబట్టి అడిగినావు. ఈకాస్త అయినతరువాత గ్రుడ్లు వెళ్లబెట్టి చూడవలెను. గుడ్డలకుతొందరేమిటే. ఉన్నవాటితో ఈ వర్షాకాలము వెళ్ళబుచ్చు.

నర—బాగా నేవుంది. ఎప్పుడు జీతమడిగినా ఏదో చెప్పుతూ కాలక్షేపము చేస్తూనే యుంటారు.

శార—ఉండు. నామనస్సేమీ బాగులేదు.

నర—అవునట పాపం అమ్మగారు నాతో చెప్పినారు. అబ్బాయిగారి కిస్తానన్న పిల్ల పాపం—

శార—నీ కమ్మగారెందుకు చెప్పింది.

నర—ఏదో మాటలసందర్భమున నే నావిడగదికేసి వెళ్లినాను.

శార—అదిగో నే ననేకపర్యాయములు చెప్పినాను, ఆపడకగదికేసి వెళ్లవద్దని. అందులో. అది యొంటరిగావున్నప్పు డసలే వెళ్లవద్దన్నాను.

నర—వెళ్లితే యేమండీ ఊరికేఅనుమానపడతారు. అమ్మగారిని ఏమయినా చేస్తానాయేమిటి? (నిష్క్రమించును).

శార—అరి వెధవ! భయంలేకుండా ఎట్లన్నాడో. వయసుగడచినపిదప వివాహమాడు నావంటి నిర్భాగ్యుల కిట్టి యనుమానము లధికముగా నుండును.

తే. గీ. వయసుగడచినతరువాత । పరిణయంబు
మొదట గౌరవంబును జూచి । బుద్ధిమాలి
యత్తవారింట నెప్పుడు । నమరియుంట,
వెట్టితనమునఁ బెరబిడ్డఁ । బెంచుకొనుట
ధాత్రిఁ గూడనిపనులంచుఁ । దలఁతు మదిని.

ఇందులో వివాహముల సంగతి ముఖ్యమైనది. మొదట వివాహమైనది. కర్మవశాత్తు అదిచస్తే ద్వితీయవివాహము చేసికొంటిని. అదిపోయినది.

మరల మూడవ పెండ్లి చేసికొని నానాఅవస్థలు పడుచుంటిని. అది చిన్నది; నేను వృద్ధుఁడను; పోనీ! ఏదియేలా తగలడితే నేమని మనస్సూరకొననీయదు. వైధవఅనుమానములు మెండు. ఏమయినా గట్టిగామాట్లాడితే చెప్పుదెబ్బ లధికము, నలుగురువింటె నగుబాట్లు. ఈసంఘ్రాహ్మణుని తీసివేదామనుకొంటేగాదు. తీసివేస్తే విస్తరిలోకి రెండుమెతుకులు వచ్చే మార్గంలేదు.

భైరవమూర్తి—(ప్రవేశించి) నాన్నా! డబ్బుబూద నీకు ఏమిరంధివున్నదయ్యా. తుదకు మనవ్యాపారము పత్రికలకు గూడ నెక్కించినారు. నలుగురులో తలయెత్తి తిరగడానికి వీలు లేకుండ చేసినావు. కట్నమో కట్నమో ఏక కట్నమే. కట్నంతో నన్ను కాట్లోకి పంపదలచుకొన్నావు కాబోలు.

శర—ఏమిటి నీసణుగుడు మనవిషయం పేపరులో యెక్కేది ఏమిటి.

భైర—ఏమిటా! ఏమిుందా! ఒకసారి యీపేపరులో యీసంగతి చూడు. నీకే తెలుస్తుంది. (పేపరు చేతికిచ్చును)

శర—(చదివి) ఈవ్రాసినవాడెవడో సంతకము లేకుండ పురవాసి యని యున్నది. నేను పరమలుబ్ధుఁడనని దూషించినాడు. పెళ్ళికిముందే నాలుగువేలు పుచ్చుకొన్నానట వీడెవడో డొక్క-బద్దలు చేస్తాను. అబ్బాయీ! నీవు పత్రిక యెడిటర్‌కు వ్రాసి యిది వ్రాసినవాడెవడో కనుక్కో. డిఫర్ మేషన్ సూట్ తెస్తాను.

భైర—అది ఒకటికక్కు-వైంది. ఆపిల్లదిచస్తూ తల్లిదండ్రులకు వ్రాసిన లేఖ కూడా ప్రకటించినారు. చూచినారా?

శర—ఆ చూచినాను. నన్ను ఎవరేమిచేస్తారో చూస్తాను.

భైర—అన్నివిషయములలోను మొండికెత్తినవాని నెవరేమిచేయగలరు. (నిష్క్రమించును).

శర—ఏడికిగూడ నేను చులకనగాదోచినాను. (ఎదుటఁజూచి) అదుగో! పేరయ్యశాస్త్రిగారు కాబోలు వచ్చుచున్నారు.

పేర—(ప్రవేశించి) బాబూ! ఏమిచేస్తున్నారు?

శర—ఏమున్నది. తలపెట్టినకార్య మిట్లయినది కదా యని విచారిస్తున్నాను. చచ్చినదానికి ఎవరూ ఏమీచేయలేము. డబ్బునష్టం గలిగిందని విచారము. పెళ్ళిఅయినతరువాత చస్తే నా కీవిచారము లేకపోవును. మాధవరావుపంతులుగారు ఏమంటున్నారు?

పేర—ఏమంటారు, నన్ను మీదగ్గరకు వెళ్ళి పైకము పట్టుకొని రమ్మన్నారు.

శర—ఇప్పుడు నాలుగు వేలు తిరిగి యియ్యవలసిన దేనా?

పేర—కార్యం కానప్పుడు వారిసొమ్ము వారికియ్యవద్దా?

శర—ఏమయిననుసరే. నేను పైకమియ్యను. ఏమిచేస్తారో చూస్తాను.

పేర—అయ్యా! లోకులపైక మింట్లో వేసికొని యియ్యనంటే యూరుకొంటారా! దావా ఫైలుచేస్తారు.

శర—ఆధారమేముంది. సాక్ష్యముండవలెను కదా!

పేర—కావలసినంత మీస్వదస్తూరీని యిచ్చిన రశీదులు చాలవా! సొమ్మునాచేతులతో మీచేతులలో బెట్టిన నేనబద్ధమాడుదునా?

శర—రసీదువ్రాత నాదికాదని కోర్టులో ప్రూఫ్ చేస్తాను. నా సంగతి నువ్వెరుగవు కాబోలు నేననేక రకముల దస్తూరి వ్రాస్తాను. ఫోర్జరీ పత్రము లనేకములు సృష్టించి యనేకమందిమీద డిక్రీలుపొందినాను.

పేర—(తనలో) రూపాయలు చేతికిచిక్కినవికదా యని కృష్ణార్పణము చెయ్యడానికాలోచిస్తున్నాడు. ఇట్లాఏడెందరిని క్షౌరముచేసినాడో

శర—ఏమిటి ఆలోచిస్తున్నారు. నేను నియ్యోగపాడిని.

పేర—ఏమయినా మీయాలోచన సరియైనదికాదు. ఇది యెవరైనా విన్నారంటే కాకినిపొడిచినట్లు పొడుస్తారు. కోర్టులెక్క తగాదాలు

పడడం నలుగురినోళ్లలో పడడమే గా ! ఆలోచనచేశామంటే చక్కీ చప్పుడూ కాకుండాయుండాలి

శర—ఆ ఆలోచన మీరుచెప్పండి ఏలాగన్నైనా నాలుగు వేలు మనకు దక్కవలెను.

పేర—అల్లాగ అన్నారు బాగున్నది, కాయితేచూడండి. నా ఆలోచన మాధవరావుగారి రెండవపిల్లను చేసికొనుటే.

శర—అందుల కాయన ఏమనునో!

పేర—నేను తగినప్రయత్నంచేసి సెటిల్ చేస్తానుగా.

శర—అవును. మీరుచెప్పినదారి బాగున్నది. 'శుభస్యశీఘ్రం' అన్నారు. కానియ్యండి.

పేర—మంచిది, (నిష్క్రమించును).

శర—ఇది బాగా నేవున్నది. ఎవరిదైనా డబ్బుపుచ్చుకొంటే మరలనియ్యాడమంటే నాకేకుపువస్తుంది. అందుకని ఈగొడవలు. కాని, పేరయ్యశాస్త్రి ఈవిషయం స్థిరపఱస్తే నేను కృతార్థుడనే.

(తెరపడును)

రంగము:—మాధవరావుగారియిల్లు.

[మాధవరావుగారు, దుర్గాంబ, చారుమతి ప్రవేశము]

మాధ—(దుర్గాంబనుజూచి) నే నెంతచెప్పినను నీవు దుఃఖింపక మానవేమి ? నీకేగాని నాకు విచారములేదా మగవాడనగుటచే బైకి పొంగనీయకుండ నుంటిని.

మ. కలికీ ! కన్నులపండువై, లలితమై । కల్యాణసంధానమై
లలితానందవిశేషదాయకమునై । లక్ష్మీవిలాసాబునై
బలుచందంబుల సమ్మదావహమునై । భాసిల్లు సత్పుత్రి మం
గళరూపంబును జూడఁజాల మిఁక, దుః । ఖంబంద నీకేటికే.

దుర్గాం—ఎట్లు దుఃఖ మాపుకొందును.

తే. గీ. చేతికందినబిడ్డ, రా | జీవనయన
పరమయోగ్యురాలు, సుగుణ | భావ, జనుల
మన్ననం గాంచి మించిన | మాన్యచరిత
యట్టిబిడ్డకై చింతింప | కెట్టులుందు.

అక్కటా! వివాహముజేసి యెంతయో ఆనందమందదలఁచితిని. నా కోరిక లన్నియు వ్యర్థమైపోయినవి. నా కీవివాహము వలదని చెప్పినప్పు డేమో యనుకొంటిని గాని, యింత కొంపముంచునని యెఱుఁగనైతిని. హా! సుశీలా! ఎంతపని చేసితివే?

చారు—అమ్మా! మనమెంత యేడ్చినను అక్కయ్య యింక రాదు.

మాధ—(ఎదుటఁజూచి) అదుగో, పేరయ్యశాస్త్రులుగారు వచ్చుచున్నారు.

పేర—(ప్రవేశించును.)

దుర్గాం—పేరయ్యశాస్త్రిగారూ!

సీ. ఆటలందైనను | నన్నృతంబను మాట
కొంచెమే నెఱుఁగని | గుణధురీణ
కన్నవారలయాజ్ఞ | గను విధేయతఁబూని
శిరసావహించెను | చెలువమిన్న
పెద్దలం గనుఁ గొన్న | వినయంబుఁ జూపుచుఁ
బ్రణతు లర్పించెను | పద్మగంధి
ఈడువారలఁ జూచి | యిదితెమ్ము మదితెమ్ము
మని కోరకుండెను | యమలచరిత
గీ. యుభయకుల పవిత్రయగుచు | నొప్పుననుచు
సంతసమ్మున మేమెంచిన | కాంత యట్టి
యనుఁగు బుత్రికను సుశీల | నవని బాసి
బ్రతికియున్నాను జీవచ్ఛ | వంబనగుచు. (ఏడ్చును.)

పేర—అమ్మా! ఎందుకల్లా కళ్ళు వాచేటట్టు యేడుస్తారు. ఏడిస్తే ఏమ
యినా వస్తుందా! ప్రపంచకమంతా ఒకనాటకము. భగవంతు
డొకరి నేడిపిస్తాడు, ఒకరిని నవ్విస్తాడు; ఇదంతా మాయ, ఈమాయ
కనుగొనడం కష్టం. ఇక మీరు దుఃఖం దిగమ్రింగాలి. ఉన్న చారు
మతిని జూచుకొనండి.

మాధ—పేరయ్యశాస్త్రిగారూ! మీరు వెళ్ళిన పని యేమయింది?

పేర—పంతులుగారూ! శరభయ్యగారు పేచీలకు పెద్దబాబు. ఒకరికి
ఎక్కువ వడ్డీమీదగాని, తక్కువసొమ్మునిచ్చి ఎక్కువమొత్తము
నకు నోట్లు వ్రాయించుకొనుటయందుగాని యున్నశ్రద్ధ, యితరుల
యొద్ద తాను తెచ్చినసొమ్ము యియ్యడానికుండదు. మీరు పేచీల
మనుష్యులు కారనిన్నీ చీటికిమాటికి కోర్టుకు ఎక్కరనిన్నీ ఆయ
నకు తెలిసి పేచీలు పెట్టుచున్నాడు. ఇందుకనే ఈసంగతులన్నీ
విచారించి మన చిన్నమ్మాయి నిస్తే ఏతగాదా వుండదు. ఆముసలి
ముండాకొడుకు ఎన్నాళ్ళుంటాడు. ఇప్పటి కరవై దాటినవి. ఆ
కాస్త ఘటం జారితే యింటికి మన అమ్మాయియే పెద్ద. కాబట్టి
తమ కంటె పెద్దనో చిన్ననో చెప్పినాను. నామాట కొంచెం
వినండి.

మాధ—పేరయ్యశాస్త్రిగారూ! మీ రెంతచెప్పినను నాచిత్తము
సమ్మతించుటలేదు.

మ. తనకున్ ద్రవ్యమె ప్రాణమంచెపుడు చిత్తంబందు నూహించు దు
ర్జనుఁ డాతండని నేటికిన్ దెలిసెఁ జాల్ల్యాలింక నవ్వానితో
డన వియ్యంబును బొందఁజాల నెటొ వేడ్కన్ బుత్రికిన్ ద్రవ్యహీ
నుని మర్యాదగలానిఁ జేతుఁ బతి; నన్యుం జూడఁ బోనింకపై.

సత్సంప్రదాయముగల యేబీదకుటుంబములో వానికైనను బ్రతిమాలి
కొని యర్పించెదను.

పేర—మీా రట్టిపట్టుదల పట్టవద్దు. నాలుగువేలరూపాయ లంటే సామాన్యముగాదు. మీా రీకార్యము వల్లకాదంటే అనవసరమైన గొడవలు డబ్బుకొఱకు పడవలసి వచ్చును.

మాధ—అయ్యా! ఈవిషయములో నేను స్వతంత్రము వహింపలేను. చారుమతి యిష్టమే.

దుర్గాం—నిజమే.

పేర—(చారుమతినిజూచి) అమ్మాయీ! సంగతులన్నియు వింటివి కదా! నీవును చనువుకొన్నదానవు ఇప్పుడు నాలుగు వేల రూపాయలు శరభయ్యగారిదగ్గఱ చిక్కినవి సిన్ను వారికునూరుడి కియ్యవలెనని యున్నది. నీ విందుకు వొప్పుకొంటావా? లేక మీా అక్కకొఱకు యిచ్చిన నాలుగు వేలు శరభయ్యగారికి కృష్ణార్పణ మన మంటావా?

మాధ—అమ్మా! సంశయింపక నీ యభిప్రాయము నెఱింగింపుము. నీయిష్ట మెట్లో యట్లు చేసెదము

చారు—(తనలో) ఇప్పుడు నే నేమిసేయుదును? అక్క మతమునకు వ్యతిరేకముగా ప్రవర్తింపఁజాలను. ఈ సంబంధము వల్లకాదని చెప్పితినేని తల్లిదండ్రు లూరకుందురుగాని, రూపాయలకు తగవు వచ్చును. కావున సమ్మతించి తరువాతమార్గమును జూచెదగాక! ఆలోచించినచో దారి దొరకక యుండునా? (ప్రకాశముగా) మా తల్లిదండ్రులయిష్ట మెట్లో యట్లే.

మాధ—అమ్మా! నీ వీ వివాహమునకు సమ్మతింతువా?

చారు—సమ్మతింతును.

పేర—తెలివైనదానవు

మాధ—పేరయ్యశాస్త్రిగారూ! అట్లయిన మీారువెళ్ళి శరభయ్య గారితో మాట్లాడి స్థిరపఱచండి. వివాహం త్వరలోనే కావాలని చెప్పండి.

పేర—అవశ్యము. (నిష్క్రమించును.)

చారు—(తనలో) అక్కా! వరశుల్క వివాహము సమ్మతిలేక నీవు ప్రాణముబాసితివి. నే నింతులకు సమ్మతించుట యిష్టముచేత కాదు. దీనికి దగినమార్గ మాలోచించి, వరశుల్కము పుచ్చుకొన్న వారికిం దగిన ప్రాయశ్చిత్తము జేసెదను

మాధ—అమ్మాయీ! రమ్ము. (నిష్క్రమించును.)



రంగము:—శరభయ్యగారి గృహము

[సీతమ్మ ప్రవేశము.]

సీత—(తనలో) ఆహా! ఈతం డెంతపరమలోభి. కొడుకు వివాహము సమీపించినను పెట్టెలోనుంచి నగలం దీయడయ్యెను. కట్టుకొనుటకు విలువగలచీరె యీయడయ్యెను ఈ సంపాదించుచున్న ధనమం తయు నితం డెవ్వ డనుభవించును!

శర—(ప్రవేశించి) ఏమే! ఎప్పుడూ ఏదోయొకటి ఆలోచించుచునే యుందువు.

సీత—ఏమున్నది. పెళ్ళిచుట్టము లందఱును వచ్చుచున్నారు నాయూష మెట్లున్నదో చూచితిరా! అనరానిగాని తెంపిమోసిన ముండవలె నున్నాను ఇది మీ కేమయిన ధర్మముగా నున్నదా? ఎన్నిసారు లడిగినను నగ లియ్యరు. చీరలు తియ్యరు.

శర—ఓసి! నీ నగలు బంగారుగావు. చంపివేయుచుంటివే. నగలు లేకపోతే పెండ్లి ఆగుతుందాటే. పెట్టెలోవుంటే కదలకుండా వుంటాయి. వంటిమీద బెట్టుకుంటే అరిగిపోతాయి. గోలపెట్టకు. రేపు యిస్తానులే.

సీత—పెట్టెలో నగలే నాకు దీసియిచ్చుటకు మీ కంతకష్టముగా నున్నప్పుడు కోడలి కేమియిచ్చెదరు ?

శర—ఇదియేం నీకుదోచిన సందేహము. ఏదో లాంఛనంకోసం నలుగురికి తెలియడంకోసమున్నూ వివాహములో పెట్టుతాను. తరువాత యింటికి వచ్చిన వెంటనే దానివంటివిగాదవికూడ తీసి పెట్టెలో తాళము వేస్తాను. (ఇంమక యూరకుండి) నీతో ఒకమాట చెప్పవలెను. ఆప్రకారం తప్పక చెయ్యవలెను. తెలిసిందా, విను, వింటున్నావా! ఇదిగో మన మనుదినము వియ్యాలవారింటికి భోజనమునకు వెళ్ళుచున్నను మనయింటికి వారు వెధవముండల ఫలహారము మొదలగు సమస్తము పంపుతారు. అనగా సున్నిఉండలు నూనె పప్పు బెల్లము ఇవియన్నీ నీవు బహుజాగ్రత్తగా భద్రపరచవలెను. ఎందుకో తెలిసిందా! ఇవన్నీ అమ్మితే డబ్బు చేతిలో పడుతుంది. వృథాగా పోగొట్టడ మెందుకు.

సీత—బాగానే వుంది ఈ సంపాదించిందంతా చాలక వియ్యాలవారు పంపించిన ఫలహారములు మొదలగునవి గూడ నమ్మించవలయునా? ఈలాంటి పనులు చేస్తే నలుగురూ మొగాన్ని ఉమ్మేస్తారు.

శర—ఉమ్మేస్తే తుడుచుకొంటే పోతుంది. మనకు డబ్బే ప్రధానము

సీత—వస్తువులమాట కేమి. మంచివి రెండు చీరెలయినను పెట్టెలో నుంచి తీసియివ్వండి.

శర—చీరెలకేమి, వియ్యాలవారు రెండు రోజులు అయిన చీరలిస్తారు. ఇవిగాక అనేకలాంచనాలు నీకురావలసి వున్నవి. అందులో ఏదీ వదలిపెట్టకు. అన్నీ చక్కగా విక్రయిస్తే డబ్బువస్తుంది. నేను త్వరగా కంసాలింటికి నగలకు వెళ్ళవలెను.

(తెరలో)

బాబూ! శరభయ్యగారూ!

శర—ఎవరది?

ఎల్లమ్మ—(ప్రవేశించి) నేను పాలయెల్లమ్మను

శర—నువ్వా! ఇప్పుడు వచ్చినావేమే?

ఎల్ల—పాలకు డబ్బిప్పించరూ!

శర—ఇదాసమయం—పెండ్లి హడావిడిలో వుంటె- నువ్వుమనిషిని చూచి డబ్బడుగుతావు. నేను ముసలిముండావాడని గనుక డబ్బడిగి నావు. శాస్త్రవరుసవాళ్లని చూస్తే పాలు పోసి- డబ్బుసంగతి మఱచిపోయి అక్కడనే కూర్చుంటావు. పాలయెల్లమ్మ పేరు తెలియని వడుచువా డెవఁడూ మనవూళ్లో లేఁడుకదా !

ఎల్ల—ఏమిటండీ పంతులుగారూ! డబ్బడిగితే యీలా వేళాకోళాలాడు తారు- బాగానేవుంది.

శర—నువ్వు జమ్మిచెట్టులాగ రోజు రోజు పొడుగెదుగుతూ వున్నావే.

ఎల్ల—చాల్లెండి మాటలు. (నిష్క్ర)

సీత—ఈ చిల్లర బాకీల వాళ్లను తిప్పడమెందుకు? ఇచ్చివేయరాదూ!

శర—నీకేం చెపుతావు. (నిష్క్రమించును)

సీత—

తే. గీ. పరులయం దితరులయందును వరుసమొకట
దయయు సత్యంబు లజ్జయుఁ దలఁపఁబోరు
పాపభయమును లేదు, లోభమతులెల్లు
బ్రహ్మచేతను సృష్టింపఁబడిరొ భువిని.

సాధారణముగా లక్ష్మిగూడ యిట్టి లోభుల యింటనే వసించుచుండును. ఇట్టిలోభులు సంపాదించి పెట్టినధనము తుద కెవ్వఁడో బయలుదేరి నాశనము చేయును. ఈకుటుంబమునకు దత్తపుత్త్రుఁ డొకడు బయలు దేరి నాడుకదా !

(తెరపడును)



రంగము:— [మాధవరావుగారు- కన్యాదాత వేషముతో ప్రవేశము]

మాధ—అబ్బా! ఆడపిల్లలవివాహము సేయుట మిగుల కష్టము.

సీ. పలుదోము కొనుటకై । జలమును బుల్లలు
చెల్లవారగనె నం । దియవలయు
ప్రొద్దు పొడువకుండ । మదమూరి కాఫిని
ఫలహారములతోడఁ । బంపవలయు
తాళమేళముతోడ । తరలిరండు భుజింప
వేగమే యంచును । బిలువవలయు
ఎవ్వరి కేరీతి । యిష్టమో యదిచూచి
కడుజాగరూకత । గాలవలయు
తే. గీ. అందఱును వచ్చుదాకను । నట్టె యుండ
వలయు; రానివారిని జేరి । యలుక దీర్ప
వలయు; నిన్ని జేసినఁగాని । పలువిధముల
నిష్ఠురోక్తులే పల్కుచు । నెగడు చుంద్రు.

నరసయ్య—(ప్రవేశించి) ఏమండీ పంతులు గారూ! ఇంకా ఈలాగునే కూర్చున్నారు.

మాధ—ఏమి చెయ్యమన్నావు.

నర—ఏమిచెయ్య మన్నావని అడుగుచున్నారా? వియ్యపురాలుగారు ఇప్పుడిప్పుడే లేస్తున్నారు. ఈవియ్యపురాలుగారు వచ్చి పూర్తిగా లేపాలి. చెయ్యవలసిన పనులన్నీ అక్కడ చెప్పుతారు లెండి. రమ్మనమనాడి.

మాధ—(ప్రక్కందిరిగి చూచి) ఓసీ!

దుర్గాం—(ప్రవేశించి) వచ్చినాను.

మాధ—వియ్యపురాలి కేమేమో చెయ్యాలట. త్వరగావెళ్లి చేయ్యి

శాస్త్రిగారిని కనుక్కొని యేమి తీసుకొని వెళ్లవలెనో తీసికొని వెళ్ళు.

దుర్గాం—మంచిది. (నిష్క్రమించును.)

నర—(నిష్క్రమించును.)

పేర—ప్రవేశించును )

మాధ—వియ్యపురాలి కేమి చెయ్యవలెనో చెప్పివచ్చితిరా?

పేర—ఆ చెప్పినాను.

మాధ—ఈవాళ సదస్యం. శరభయ్యగారు సంభావనలు భారీగానే యిస్తారని తోస్తుంది.

పేర—అప్పేమీ ఆయన యొద్ద యుడగు. సంభావన గింభావన యేమీ లేదు. నల్గురు పోలీసు బంట్రోతులకు నాలుగర్ధరూపాయ లిచ్చి కాస్సేపు వాకిట్లో నిలచుని ఎవరైనా సంభావన బ్రాహ్మణులువస్తే అవతలకు సాగనంపమని అప్పుడే పురమాయించినారు.

నరసయ్య—(ప్రవేశించి) ఏమండీ పంతులుగారూ! ఇటూ అటుతిరగ లేక మధ్య నాకాళ్ళు విరిగి పోతున్నవి. కాఫీఉపమాలు రాలేదట. వెళ్ళిరమ్మన్నారు. మీరు చూస్తే యిక్కడ ఆలస్యం చేస్తారు. అక్కడవారు కారాలు మిరియాలునూరుతున్నారు. నిన్న ఉపమా సరిగా వుండలేదని ఒకరు. ఉండకట్టుకొని పోయిందని యొకరు. కాఫీలో పాలు తక్కువయని యొకరు గోలపెట్టినారు. కారాకిల్లీలు పంపలేదట. దిక్కుమాలిన వాచిపిగరెట్లట. ఈవాళ వారికి కత్తెర మార్కు పెట్టెలు కావాలట. చుట్టలు మంచివి లంకాకువి పంపండి. నేను వెళ్ళుతున్నాను. (నిష్క్రమించును.)

మాధ—అబ్బా! ఈ సప్లయిసరంజాములు చెయ్యలేక చచ్చిపోతున్నాను. వియ్యాలవారు మనమీద “మిలిటరీఫోర్సు” ఉపయోగిస్తున్నారు. (నిష్క్రమించును)

పేర—మాధవరావుగారు తెచ్చిన సొమ్మంతా అయిపోవచ్చినది. ఆడ పిల్లపెళ్ళి చేసినవాడు- కార్యమయిన తరువాత అక్కఱకు వచ్చిన వాడెవడు. ఆస్తి తనఖా పెట్టి తెస్తేనా దానికి దానికి సరిపోతుంది. మరియొక మోస్తరుగా అప్పు తెస్తేనా- ఇక సాల్మెంటు పిటీ షను; కాబట్టి అయిదవరోజు దాటకుండనే మాధవరావుపంతులు గారి దగ్గఱ నాకు రావలసినది నేనువసూలు చేసుకోవాలి. (నిష్క్ర మించును.)

రంగము:—[పెండ్లిపందిరిలో మాధవరావుగారు ప్రవేశము]

మాధ—విస్తళ్ళు వేసి కనిపెట్టుకొని యున్నను భోజనమున కెవ్వరును రాలేదు. ఎన్నిసార్లని కబురులు పంపను. ఎన్నిసారులు నేను వెళ్ళి బ్రతిమాలుకొందును మరల పేరయ్యశాస్త్రిగారిని పంపినాను. (ఎదుటజూచి) అదుగో! ఆయన వచ్చుచున్నారు.

పేర—(ప్రవేశించును.)

మాధ—ఏమండీ! పేరయ్యశాస్త్రిగారూ! ఈవాళ మనకు భోజనము యోగ్యత యేమయిన నున్నదా? లేదా? పెళ్ళింగూడ నేకాదశీ యుపవాసములే చేయవలసివచ్చుచున్నవే.

పేర—బాబూ! ఏమని చెప్పను. వెళ్ళి పిలిచాను. అందఱూ తలో మోస్తరుగా చెప్పుచున్నారు. అబ్బబ్బా! ఏమిబెట్లు కొందరు కారా కిల్లీ నములుతూ కూర్చున్నారు. కొందఱు సిగరెట్లు దమ్ములు వేస్తు న్నారు. కొందఱు పేకాట. ఎవరిని కదిపినా కోపమే. బంగాళదుం పల కూర- ఉల్లిపాయ పప్పుపులుసూ పెట్టిస్తే వస్తానన్నవారు కొంత మంది. ఇది ఈలాఉండగా ఇంకో చిత్రం- విధవపెళ్ళిచేసు కొన్నాయన యెవరో మన యింటికి వచ్చినారని యొక శాస్త్రుల్లుగా రనేటప్పటికదేనిజమని అంతా గోలచెయ్యడం మొదలుపెట్టినారు. రామరామా! అటువంటిది లేదని చెప్పి నేను వప్పించాను. ఇంత

ట్లోకే ఇంకొకరు వచ్చి, తిలవెంట్రుకలు పెంచుకొన్న దిగుపల్లి సీతమ్మగారున్నూ, పత్రి నరసమ్మగారున్నూ, ఊరికే పంక్తికి భోజనానికి రావడంగూడ తప్పేసన్నారు.

మాధ—ఇంతకు మీరు యేమిచేసికొని వచ్చినారు.

పేర—మొత్తాని గేలాగునో బ్రతిమాలుకొని అందఱినీ బయలుదేర దీసినాను. కానియ్యండి.

దుర్గాం—(ప్రవేశించి) పేరయ్యశాస్త్రులుగారూ! ఉభయత్ర మీరు మధ్యస్థులై యుండియు నిట్లు చేయించుచున్నారేమి. వారిలాంఛనములు వేంకటేశ్వరుని ముడుపువలె చెల్లించుచున్నాము మనకు మాత్రము సున్నయగుచున్నవి. వెతకివెతకి మాకు దొడ్డసంబాధము తెచ్చినారు.

పేర—అమ్మా! లాంఛనములలో మనకు మునిగిపోయిన దేమున్నది; కాస్త కార్యమువనియ్యండి.

దుర్గాం—చివఱకు మీరు చెప్పేమాట అంతేలెండి. (నిష్క్రమించును)

మాధ—శాస్త్రులుగారూ! ఆడవాళ్ళమాటలు మీరు పాటించవలదు. ఇప్పుడు మన మేమనుకొన్నను లాభములేదు. ఎంత బాగుగ జేసిననను పెండ్లియందు నిష్ఠురోక్తులు రాకమానవు. రండు.

(నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.





శ్రీరస్తు.

# వరవిక్రయము.

## పంచమాంకము

రంగము:—[ప్లీడరు కబుర్ల కామరాజుగారు కచేరీ చావడిలో ప్రవేశము.]

కామ—ఇన్నివేలు తగలేసి యీ యింగ్లీషు చదువు చదివి, బి యల్ ప్యాసు చేశామన్నమాటేగాని, దిక్కుమాలిన ప్లీడరీలో గుమాస్తా జీతమైనా గిట్టడంలేదు. ఈ నెలలో అన్నీ మేజస్ట్రీటు కోర్టులో కొంచి కేసులే గాని ఒక్కటికీ ఒరిజినల్ సూట్‌గాని, స్మాల్ కాజ్ కాని లేదు గుమాస్తాజీతం క్రిందటినెలలో బాకీపడ్డాను. ఈ నెలగూడా అయింది. పై డాబుకోసమైన ఇవియన్నీ తప్పవు. ఖర్చు తగ్గించుదామంటే అదీ తప్పదు. టౌనుహాలుకు వెళ్ళకతప్పదు. సైకిలుండకతప్పదు. ఎవరైనా ఫ్రెండ్సు రిఫ్రెష్‌మెంటు రూముకు రమ్మంటే వెళ్ళకతప్పదు. తక్కినవిషయము లెట్లున్నా డ్రస్సు నీటుగాను అట్రాక్టివుగాను వుంచవలెను ఇన్ని వుంటేనేగాని ఏపల్లెటూరినుంచి వచ్చినవారైతేనా హాకిలీకేసు యివ్వడు బాగా ఆలోచించి చూడగా ఇప్పట్లో నాకు కాఫీహోటలు వృత్తి చాలా బాగావున్నది ఏమిటో ప్లీడరు ప్రాక్టీసు నేను మొదలుపెట్టి కొంచెము కేసులలో పనిచెయ్యడం ప్రారంభించేసరికి దిక్కుమాలిన

నాకకో ఆపరేషను వచ్చింది. మావంటివాళ్ళనోట్లో దుమ్ము కొట్టింది. నావంటివాళ్ళకి ఏతాలూకాబోర్డు ప్రెసిడెంట్‌పిప్పో, మ్యూనిసిపల్ చైరుమనుషిప్పో వుంటే పరవాలేదు. నెట్టుకొని రావచ్చును. (ఎదుటఁ జూచి) ఎవరో వచ్చుచున్నారు.

[శరభయ్యగారు ప్రవేశించుచున్నారు.]

కామ—ఓహో! శరభయ్యగారా! దయచెయ్యండి.

శర—(కూర్చుండును.)

కామ—ఏదో పనిమీద దయచేసినారే!

శర—గొప్పపనియేవుంది.

కామ—కోర్టు సంబంధమేనా!

శర—అవునండి.

కామ—అయితే కానియ్యండి. మళ్ళీ కోర్టుకు వేళవుతుంది.

శర—నందూరి మాధవరావు పంతులుగారికుమార్తెను మాఅబ్బాయి కిచ్చి వివాహము జేసినసంగతి తమకు తెలుసును కదా!

కామ—తెలియకేం. పెళ్ళికి నేనుగూడ భోజనానికి వచ్చినాను.

శర—వివాహకాలమందు నేను పిల్లవంటిమీద నాలుగువేల రూపాయల నగలు పెట్టినాను. పిల్లను వారు కాపురమునకు బంపుట లేదు. ఆ నగలను వారు హరించు నుద్దేశముతో నున్నారు. ఈవిషయం మనం గట్టిగా ఆలోచించాలి.

కామ—సరే. ఆలోచనయేమున్నది. సదరువస్తువులతో పిల్లను కాపురమునకు వెంటనే పంపించవలసినదని లాయక్ నోటీసు ఇద్దాము.

శర—నాతలపు అది యొకటేకాదు. మనవస్తువులు మనకు రావడం, ఆపిల్లతో సంబంధం లేకుండా చేయడం, ఒకవేళ వారు మనోవృత్తి కేదయినా స్యూట్ తెస్తే అదిలేకుండా చెయ్యడం, ఇది అంతా కావాలి.

కామ—సరే. ఇదెంతపని. ఇప్పుడున్న మునసబుగారు చాలామంచి
వారు; అదికాకుండా నాకు క్లాస్ మేట్; ఆసంగతి అల్లావుంచండి.
ప్లీడరుబార్‌లో మనపేరు గ్యాసులైటుక్రింద వెలుగుతూవుంది.
అయితే మీా అబ్బాయికి మైనార్టీ వదిలిందికదా.

శర—ఆ.

కామ—మీాఅబ్బాయి పేరనే రిజిస్టరీ నోటీసు పంపుతాను. సాయం
కాలము దయచెయ్యండి. అన్నట్లు మఱచిపోయినాను. రిజస్టరీ
నోటీసుతో వ్యాపారం ఫయిసలు కాదుగనుక, ఇన్నిసార్లుమిమ్మల్ని
అడగడం ఎందుకు- ఫీజుకు స్టాంపు డ్యూటీకి ఏమయినా కొంచెము
లెఖ పట్టుకొని రండి. (నిష్క్రమింపను.)

శర—ప్లీడర్లింటికి కేసు తెస్తే ముందుకావలసింది ఫీజు.

తే. గీ. కుమరునో కుదరదో డబ్బు కుంజుకొనును
జల్లగా రోగియొద్ద భిషగ్వరుండు
నోడుగెల్పుల పనియు లేకుండ ముందె
ఫీజు లాగును ప్లీడరు పృథ్వియందు.

(నిష్క్రమించును.)



రంగము:—మాధవరావుగారియిల్లు.

[ప్రవేశము: చారుమతి మాధవరావుగారు]

చారు—ఏదేదీ! నాన్నగారూ! ఆప్లీడరు ఇచ్చిననోటీసు చదవండి.

మాధ—మహారాజశ్రీ నండూరి మాధవరావుపంతులుగారికి—
కబుర్లకామరాజు బి. య్యే. బియల్. యిచ్చిన నోటీసు—
మాక్లయింటయిన మాచిరాజు భైరవమూర్తిగారి వివాహ
సందర్భమున వారితండ్రిచేత మీాపిల్లకు పెట్టబడిన నాల్గువేలరూపా
యల వస్తువులు మీారు అపహరించుదురుద్దేశములోవుంది, సదరుపిల్లను

యింతవఱకు గాపురమునకు బంపక యున్నారు. కావున యీ నోటీసు అందిన 24 గంటలలోగా పిల్లను వస్తువులతోసహా మాక్లయింటుకు వప్పగించి సదరువస్తువులు ముట్టినట్లు రశీదు పుచ్చుకోనియెడల మీా మీాద క్రమమైనచర్య జరిపించడ మవుసని యిందుమూలముగా తెలి యాపరచడ మైనది.

ఇట్లు

కబుర్ల కామరాజు, బియే. బియల్.

(ఇంచుక యూరకుండి) అమ్మా! వింటివా? ఈయనవసరమైన తగాదా లెందుకని యింతకుపూర్వమే నీతోఁ జెప్పియున్నాను. ఇప్పు డైనను నీవు నామాటవిని వా రింటి కరుగుము. వారు కోర్టు ఎక్కకుండఁ జూడుము.

చారు—నాన్నగారూ! మీారు భయపడవలదు. ఈ వ్యాపారము కోర్టుకువెళ్ళి తీరవలయును. మనకు శుభమే యగును. చిన్నదాన నైనను నాయందుఁ గరుణించి మీా రూరకొనుడు. ఈనోటీసున కేమియు జవా బీయవలదు.

మాధ—నీ వట్లుచెప్పుచున్న నే నేమనఁగలను. నీధైర్య మేమో నాకు తెలియదు. (నిష్క్రమించును.)

చారు—హే పరమేశ్వరా!

తే. గీ. భవ్యభవదీయ కరుణ నా ౯ పైనఁ జూప
సమయ మిప్పుడువచ్చెను ౯ జగతిలోన
చారుమతియత్న మెల్లను ౯ సఫలముగను
జేసి, కీర్తినింగూర్చి ర ౯ క్షింపుమయ్య.

(నిష్క్రమించును.)



రంగము:—కోర్టు.

[న్యాయాధిపతి, కబుర్లు కామరాజుగారు, శరభయ్యగారు, భైరవమూర్తి, మాధవరావుగారు, చారుమతి ప్రవేశము]

మాధ—(తనలో) ఆహా! ఎన్నడును కోర్టుమొగ మెఱుఁగని నే నీపరమలోభితో వియ్యమందుటంజేసి యెక్కవలసి వచ్చినదికదా. ఒకరితో నొకరు తగవులాడి స్టాంపుఖర్చులక్రింద కొంతయు ప్లీడరు ఫీజుక్రింద కొంతయుఁ బోసి కోర్టుచుట్టును దిరుగు మూఢులనుజూచిన నాకు నవ్వువచ్చును. రామ రామ! పార్టీలు కోర్టులోపడుబాధలు చెప్పతరముగాదు. బిళ్ళబంట్రోతు మొదలుజేసికొని కోర్టుగుమాస్తా- ఆఖరుకు శిరస్తాదారువరకూ గూడా లంచములు బోయుచుందురు.

భైర—(తనలో) పరమలోభియగు నే నీతండ్రి కేల దత్తపుత్రుఁడనైతినోకదా! మొదటినుంచియు నీతడు దురాలోచనా పరుఁడై యుండియే యీ వివాహములకు సమ్మతించినాఁడు. ఈతనిమూలంబునఁగదా తగుదునని యాలితో దగవులాడ కోర్టు కెక్కితిని.

న్యాయా—(కాగితములు జూచి) కామరాజుగారూ! ఐ హావ్ స్టడీడ్ ఆల్ ది కేజ్, బట్ వాటెవర్ ది తింగ్ మే బి, ఐ శే ఇటీస్ బెటర్ దట్ దె షుడ్ కాంప్రొమైజ్. (నేను కే సంతా చదివినాను. ఏమైనాగానీ, వీరు రాజీనామా పడితే బాగావుంటుంది.)

కామ—నో నో. ఇది రాజీనామా అయ్యే కేసుగాదు. శరభయ్యగారంటే సామాన్యులుగారు. అనేకసార్లు తాలూకాబోర్డు మెంబరుకోసంగూడా ప్రయత్నంచేసి ఫెయిల్ అయినారు. లక్షరూపాయీల స్థితిపరులు.

శర—(రహస్యంగా) స్థితిమాట యిప్పు డెందుకు. ఇక కంటాక్ను నెత్తిమీద బడుతుందేమో!

న్యాయా—ఈ యనవసరమైన గొడవ లన్నీ యిప్పు డెందుకు? ప్రస్తుత వ్యాపారం చూడండి. వీలుగానుంటే కాంప్రొమైజుకోసం ఆలోచించండి.

కామ—దట్ కెనాట్ బి డన్. మోర్ ఓవర్ మై క్లయింట్ విల్ నాట్ అగ్రి కాబట్టి దానివలన లాభంలేదు. మేము కేసు నెగ్గగలము. సివిల్ ప్రొసీజర్ కోడ్‌లో పెళ్ళికాలమందు అత్తవారు పెట్టిన నగలు పుట్టింటివారు తీసికొనగూడదని యనేకసెక్షను లున్నవి. ఈవిషయంలో జస్టిస్ రిచ్‌మండ్‌గారు అనేకతీర్పులు చెప్పినారు.

శర—కోర్టువారు న్యాయం దయచేయించండి. మేమీలావాదే వీలు పడలేము. మా నగలు మాకిప్పించి వారికి మాకు సంబంధం విడకొట్టండి.

న్యాయ—అట్లుచెప్పెదరేమి? కావలయునని తెచ్చుకొన్నకోడలు అక్కఱలేదనెదరు!

శర—మరేమీలేదు. ఆపిల్ల ఒకవేళ యిప్పట్లో తీర్పుఆజ్ఞ ననుసరించివచ్చినా మాపిల్లవానితో కాపురము సరిగాచేయదు.

న్యాయ—మాధవరావుగారూ! శరభయ్యగా రట్లుచెప్పెదరేమి?

మాధ—నేనేమియుఁ జెప్పఁజాలను. కోర్టునందు వాదించువాఁడను గాను. నాకు ప్లీడరులేడు భగవంతుఁ డెట్లుచేసిన నట్లు చేయుదు.

చారు—(తనలో) ఇఁక నేనూరకొననేల? (న్యాయాధిపతిని జూచి) మీరు న్యాయమూర్తులు; ధర్మాధర్మములు పరిశీలించు మహానుభావులగుటచే మిమ్ము న్యాయమూర్తులనిరి. మీరు నాకు దండ్రి వంటివారు గనుక నేను మాటలాడ సాహసించినాను. మాతండ్రి

గారికి వాదవతోఁ బనిలేదు. కథానాయకను నేనే గనుక నేనే చెప్పుకొందును. ఆజ్ఞ దయ సేయుడు.

కామ—యువర్ హానరబిల్ కోర్ట్ ఐ బెగ్ టు సబ్మిట్ దట్ షి ఇస్ నాట్ అట్టెన్డ్ మెజారిటీ; సో షీ ఇస్ నాట్ అడ్మిటెడ్ టూ స్పీక్ బిఫోర్ దికోర్ట్.

న్యాయా—డజ్ న్ట్ మేటర్ షీ ఇస్ ఆథరైజ్డ్. అమ్మాయీ! నీవు చెప్ప దలచుకొన్నది చెప్పు.

చారు—ఇదిగో చెప్పుచున్నాను. పీరు నాకు వివాహకాలమునఁ బెట్టిన నగలు హరింపఁ దలఁచినారనియుఁ, గాపురమునకు వారింటికి వెళ్ళలే దనియుఁ గదా వారివాదనము. వివాహకాలమునఁ బెట్టఁబడిన సొమ్ము మురల వారు గైకొనుటకు హక్కులేదు.

కామ—ఎందుచేత. ఎందుచేత.

చారు—అది స్త్రీధనము.

కామ—కాదు. కాదు.

న్యాయా—ఉండవయ్యా! నీవాడావిడి యాపు. అమ్మాయీ! రెండవ సంగతియేమి?

చారు—రెండవసంగతి ఈవిషయమే కోర్టువారు మిగుల న్యాయదృష్టితోఁ బరిశీలింపవలయును. వారింటికి నేను వెళ్లుట యవసరము లేదు. నాభర్తయే నా యింటికి రావలయును.

కామ—లోకవిరుద్ధము.

న్యాయా—అమ్మా! అదియెట్లు?

చారు—మహానుభావా! వినుడు. ఈసంబంధము మొదట మాయక్క నిమిత్త మేర్పఱుపఁ బడినది. వేలమునందు నాలుగువేలరూపాయలకు పోటీమీాద వరుడుకొనఁబడినాడు. అందుకు సంబంధమైన రశీదు చిత్తగించండి. (రశీదు నిచ్చును.)

న్యాయా—(రశీదు చదివి) ఏమండి! శరభయ్యగారూ! ఈరశీదును గుఱించి యేమనెదరు?

శర—ఇది నాదస్తూరి కాదండి నా వ్రాలు కాదండి.

న్యాయా—మాటజారకండి. అది మీదస్తూరీ అని ప్రూఫ్ అయిందంటే క్రిమినల్‌గా మిమ్ము చార్జిచేయవలసివస్తుంది.

చారు—తరువాతి వివాహమునకుఁ బూర్వమే మాతండ్రిగారు నియమించుకొనిన శుల్కము శరభయ్యగారికి బంపించి యీరసీదుపుచ్చుకొన్నారు. చూడండి. (ఇచ్చును)

న్యాయా—(చదివి) ఇదియంతా ఒకవిధమైన బార్గెనులాగున్నది.

చారు—ఇట్టి వరశుల్క వివాహ మిష్టము లేక మాయక్క నూతిలో బడి జీవముల బాసినది. ఆమె మృతినిగూర్చి యెవ్వరో పత్రికలో ప్రకటించినారు. ఈప్రకటన జూడండి.

న్యాయా—(కాగితముచూచి) పాపము!

చారు—సొమ్ము శరభయ్యగారిచేతఁ జిక్కుటచే, నావివాహము నాక్రింద మార్చఁ బడినది. నాలుగువేలరూపాయలనిచ్చి మాతండ్రిగారు శరభయ్యగారి కుమారుని నాకొఱకుఁ గొనుటచేత, నాకే నా యింటికి రావలయును. మేమిచ్చినది క్రయధనం.

కామ—అది కట్నము.

చారు—కట్నమనునది వివాహసమయమున సంతోషపూర్వకముగ నిచ్చునది. ఇది క్రయధనము గనుకనే బజానాలు రశీదులు ఏర్పడినవి.

న్యాయా—నిజము నిజము.

భైర—(తనలో) బుద్ధితెలిసిన నే నూరకొనుటచేత నీవ్యవహారమింత వఱకువచ్చినది. ఇక నేనూరకొనను.

తే. గీ. పరమలోభియై కార్య మీరీతి భంగిఁ జేసెఁ
దండ్రి; సమ్మతించితి నేను ధరణియందు

జనములెల్లరు బరిహాస ǂ మాడకుండ్రె
యిట్టి కార్యంబు నుడిగట్టి ǂ తే యటంచు.

(న్యాయాధిపతిని జూచి) న్యాయమూర్తీ! నామాటలు గొంచెము వినుడు. చారుమతి చెప్పినదంతయు సత్యము. నాతండ్రి మొదటినుంచియు ద్రోహబుద్ధితోడనే ప్రవర్తించెను. అవియన్నియు నేను వెల్లడింపజాలను.

చ. నిజముగ నమ్మె నన్ను నవ ǂ నీరజనేత్రికి వాల్గువేలకున్
బ్రజలుహసింపగా రమణి ǂ పల్కినపల్కులు సత్యమయ్య యీ
గజిబిజియేల భృత్యుడన ǂ కాంత వచించిన యట్లు సంతతం
బు జగతి జేసెదన్ బదుల ǂ మోదముమీఱగ దప్పకుండగన్.

శుల్కముగ్రహించి వివాహమాడువారెల్లరును భార్యకుభృత్యులనియే నాయభిప్రాయము.

న్యాయా——మంచిమాట బలికితివి. కోర్టువారితీర్పుతో బనిలేకుండ జేసితివి.

శర——ఓరి దెష్టముండాకొడకా! ఎట్లు చెప్పుచుంటివిరా, నలువురిలో నన్ను నగుబాట్లు జేసితివిగదరా!

బైర——(భార్యనుజూచి)

తే. గీ. పరమలోభియై నాతండ్రి ǂ కరుణలేక
నీచకార్యంబు గావించె ǂ నీరజాక్షి
చిత్తమందున నయ్యది ǂ చేర్పకోక
దాసునిగ నేలు నన్నింక ǂ ధన్యచరిత.

చారు——నాథా! రండు. ఇప్పటికి మనము కృతార్థులమైతిమి. వరశుల్క దుర్ణయాచారమును గర్హించుచు బోధనలిపి పోవుదము.

(తెరవాలును.)



రంగము—రాజవీధి.

[భైరవమూర్తి, చారుమతి ప్రవేశము]

భైర—

సీ. కన్నమాశించి లో - కంబు గర్హింపగా
విద్యార్థులై యొప్పు - వెధవలార
పుస్తె కట్టెడు వేళ - ముడుపుల నిమ్మంచు
ఘోష పెట్టుచునుండు - కూళలార
అలకపానుపుమీద - పాలము నీవలెనంచు
సిగ్గువిడిచి కోరు - జెష్ఠలార
పండుగదినములఁ - బరువెత్తి యత్తిల్లు
గుల్లగాఁ జేసెడి - కుమతులార
తే. గీ. భార్యకమ్ముడువోయిన - పశువులార
పాపమొనరించినందుకు - బడతి కికను
జన్మదాస్యంబు జేసి య - శంబుగనుడు
గాకయున్నఁ గలుగు నర - కంబు మీకు.

చారు—

సీ. కట్నాల నడిగెడు - కాంతులచేఁ బుస్తెఁ
గట్టించుకొనవద్దు - కన్నెలార
ధనిమిచ్చి తెచ్చెడు - ధవులతోఁ బల్లకి
నూరేగబోకుడీ - యువిదలార
విత్తంబుచే మీకు - భృత్యులౌ నాథుల
నైగొనంగ దగదో - కాంతలార
మీతల్లిదండ్రులు - మీకునై గొంపల
మ్ముట దలపోయుడీ - ముగ్ధలార

గీ॥ మదిని యోచించి చూడుఁడీ ఽ మహిని నిట్టి
పరిణయంబులు హేయమై ఽ బరగి దుర్య
శంబు దెచ్చుననుచు సరో ఽ జాక్షులార
తల్లులార యోసద్గుణ ఽ వల్లులార.

[ఒక బ్రాహ్మణుఁడు ప్రవేశించి]

సీ. వరశుల్కము గ్రహింప ఽ వరపుత్రు నారితిఁ
బేరుకై స్కూలుకం ఽ పించినాను
వేలంబు బెట్టించి ఽ విబుధు లెల్లరునవ్వ
బాగుగా పదివేలు ఽ లాగినాను
పెండ్లిలోఁ గలహంబు ఽ పెంచి తిట్లుదినుచు
లాంచనాల్ కొన్ని గ్ర ఽ హించినాను
బాడిగ కీయ లా ఽ భంబుగల్గుననుచు
మేలైనయిల్లు ని ఽ ర్మించినాను
కాలవశమున నిల్లెల్ల ఽ గాలిపోయె
నింటనున్నట్టి ధనమెల్ల ఽ మంటఁగలిసె
బెంగచేఁ గుమారుఁడు వెఱ్ఱి ఽ పీనుగాయె
విటునిపజ్జకు గోడలు ఽ వెళ్ళిపోయె
వ్యాయావారపు చెంబిదె ఽ వచ్చెనాకు.

[ఒక కమ్మ ప్రవేశించి.]

సీ. కాంపౌండువడ్డీలు ఽ గట్టి లెక్కకుమీరు
సిరి యింటిలోపలఁ ఽ జేర్చినాను
పదిపుట్లమాగాని ఽ పండఁటి బిడ్డతో
పెళ్ళిపీనుగకిచ్చి ఽ పెలసినాను

అలకపానుపుమీాద \ నంటుమామిడితోట
ఆడిమెదా నట్టి \ యలరినాను
వెట్టిముండాకొడుకు \ బిడ్డను వోదిలేసి
యింకొకర్తెను జేర్ప \ మేడ్చినాను
కాలవశమున సామ్ముల్ల \ నేలగలవ
కూడుగుడ్డలు నాకును \ కూతురకును
సున్నయయ్యెను నల్లుళ్ళ \ కన్ని బెట్టు
తెలివితక్కు కమ్మోరి \ ఫలితమింతె.

ఒకసెట్టి—(ప్రవేశించి)అంతా సెప్పుకున్నారు. నేనుకూంత సెప్పుతాను.

సీ. చోళులందెచ్చి యా \ వాలలోపలగల్పి
సిత్రంబుగాడబ్బు \ సేర్చినాను
మేనల్లుడుండగా \ భమవిడ్సియింకోణ్ణి
మొతికొత్కిపిల్లను \ యిచ్చినాను
పదివేలరొక్కము \ బళ్ళునబోర్లించి
నడవళ్లు సక్కగా \ నడిపినాను
ఏలూరుపాపిని \ వేలిచ్చి పిలిపించి
యాటను నాడించి \ యలరినా॥

గీ॥ కడకు సర్వంబుక్షారంబు \ గాగ నన్ను
నప్పులోళ్లు బెట్టెడిబాధ \ నందలేక
తెంపుబూని దివాలాను \ తీసినాను
బూనినాను ఈ సెనగల \ బుట్టనిపుడు.

కరభయ్యగారు—(ప్రవేశించి చారుమతిని జూచి) అమ్మా! చారుమతీ! నీవు సుగుణవతివి. పరమలోభినై నే ననేక దుష్కార్యములాచరించి ధనము నార్జించితిని. నా పాపపరిహారముగా నాకున్న

యాస్తియంతయు నీచేతిలోఁ బెట్టుచున్నాను. సగము నీపోషణమున కుంచుకొని తక్కినది ధర్మములకై నీయిష్టము నట్లు వినియోగపఱుపుము. ఇక నేమికావలయును.

చారు—

తే. గీ. భరతదేశంబునందుఁ గొంకిపలను గుల్ల
జేయు వరశుల్క మింక నశించు గాక
నెలత లెల్లరు సాధ్వులై లలితభక్తిఁ
గొలిచి మగలయశంబును గొంద్రుగాక.

(తెరవ్రాలును)

ఇది పంచమాంకము

సర్వము సంపూర్ణము.



# భక్తతుకారాము.

ఇయ్యది, అష్టావధానులు, నసేమిరాద్యనేక నాటకగ్రంథకర్తలు నగు బ్రహ్మశ్రీ త్యాడీ వేంకటశాస్త్రిగారిచే రచియింపఁబడినట్టియుఁ, దత్ప్రతిమాసహితమైనట్టియు శ్రుతిస్మృతీతిహాసోపనిషదాద్యభిప్రాయవిశిష్టమైనట్టియుఁ, బూర్వకవి శైలి ననుసరించి మృదుమధుర పదాలంకారాది ప్రౌఢమార్గశోభితంబయి సకలసుజనహృదయంబుల కత్యంతహృద్యం బగునట్టియు, సుమారు 120 పుటలు గలిగినట్టియుఁ, జగత్ప్రత్యక్షమైన వైనంకముల సుప్రసిద్ధ నాటకరాజము.

అంచెకూలి సహితముగా వెల రు 1—4—0.

---

వేచియుండుఁడు! వేచియుండుఁడు!!

రాబోవు నాటక రాజము.

# మధుసేవ.



భారతమాత కొక యమూల్యాలంకారము.

మన భారత దేశమునకు మహత్తరశత్రువై మన దారిద్ర్యమునకు హేతుభూతమై, దేశమును పీల్చి పిప్పిచేయుచున్న మధుపానముపై ప్రయోగింపఁ బడిన వజ్రాయుధము! హాస్యరసమున్ను, కరుణరసమున్ను, సర్వత్ర పొంగి పొరలు చుండును. ప్రేక్షకులను హాయి! హాయి! యని పించు నాటకరాజ మిదియే!

ముందుగనే ఆర్డర్లు పంపుకొను వారు ధన్యులు.

వెల రు. 1—0—0 మాత్రమే ! పోస్టేజి వేరు.

వలయువారు:—ఉసిరిక బంగారయ్య.

